శ్రీ సద్గురువే నమః

# స్థాఞకాప్రబోధ

మూఁడవ భాగము

గీ॥ పరమ సుజ్ఞాన బోధలు ధరణియందు
పరిణమించెను యిహపరలోకము లెల్ల
గరిమతోఁడుత గన నెన్నిబోధలున్న
స్థాఞకా వారిబోధకు సాటిరావు॥

ఇది

సర్వమతసమ్మతజనరంజనీయము

గ్రంథకర్త

స్వానుభవ

శ్రీ స్థాఞకా స్వాములు



శ్రీ స్థాణకా స్వాములు

శ్రీ సద్గురు వే నమః

# స్థాన్ - కా - రహస్య - బోధ

యను యీ నాల్గు పదముల విమర్శ

స్థాన్:— అనగా గుహ్యస్థానము. ఇది పంచకళలతో ఆవరింప బడి యున్నది. ఇది నాశరహితమైన ఒక ఖాళీస్థలము. దీనికి బయలనిపేరు. బయలనగాగాలి. దీనిని స్వరమని పిలి చెదరు. స్వరమనగా శబ్దము. రూపునామములేని దానిని రూపించుటకై ఒకనామము కావలసివచ్చెను. అట్టి నామము శబ్దముచే కల్పితమాయెను. ఇట్టి కల్పితనామము నకె స్థాన్ యనిపేరు. గనుక స్థాన్ యనునది పరబ్రహ్మము యొక్క నామధేయము. స్థాన్ యనగా రాజధానివంటిది యని తెలియుము.

కా:— అనగా కారణమూర్తి. స్థాన్ యనెడు నాశరహిత స్థానమును జూపు కారణుడు గురువుయనబడును. ఇట్టి గురువునకు 'స్థాన్ కా' యనిపేరు.

రహస్యం:— అనగా పరబ్రహ్మమును మానవులు తెలుసు కొనలేక పోవుటవలన పరబ్రహ్మము మరుగైయున్నది. ఇట్టి మరుగైనదానికే రహస్యమనిపేరు గనుక పరబ్రహ్మమే రహస్యము. రహస్యమే పరబ్రహ్మమని తెలియుము.

బోధ:— అనగా ఒకరిమనస్సును ఒకదానిపై దృఢనమ్మిక కలుగజేయునట్టి మాటలకు బోధయందురు. ఇట్టిబోధకు నికి 'స్థాన్ కా రహస్యబోధకుడని' పేరుగలిగెనని యెరుంగుడి.

# శ్రీ స్థానికా ప్రవక్తలవారి జీవితము

| | |
|---|---|
| నా పేరు : | స్థానికా రహస్య బోధకుడు |
| నా మతము : | సమ్మతము |
| నా కులము : | అనుకూలము |
| నా ఆచారము : | సవిచారము |
| నా వంశము : | నిస్సంశయము |
| నా గోత్రం : | కామం |
| నా వూరు : | పరవూరు |
| నా యింటిపేరు : | దేహము |
| నా తల్లి దండ్రి : | శమము, దమము |
| నా చెల్లెలు : | శ్రద్ధ |
| నా సహోదరులు : | సత్యం, ధర్మం, దయ, శాంతం. |

# శ్రీ స్థాన్ కా ప్రబోధ

## స్థాన్కా సమత్వ ప్రభావము

ప్రపంచములోగల దేహాభిమానులకై నూతనముగా బయలు వెడలు స్థాన్కా సమత్వము వాదించునదేమన కృత, త్రేతా, ద్వాపర, కలియుగ పర్యంతము జీవ, దేవ, సంధి నెరుగుటకు కావించిన నానావిధ మతగ్రంథ ప్రమాణములను జూచి, విని, అనుభవించి, మనోవికారభ్రమ రహితమగుటయే లేక, మనోసంకల్పాధిని పోగొట్టి, నిస్సంకల్పుడగుటయే, లేక మనోనిర్మలంబై శూన్యంబగుటయే బ్రహ్మైక్యాంబని లేక మోక్షంబని దృఢనిశ్చయము గలిగి స్థాన్కాయను పరిశుద్ధ నామంబు, సృష్టి స్థితిలయములకు కారణంబై నామరూప రహితమైన పరమాత్మకు సాటియై ప్రపంచము నుద్ధరించుటకు ఈశ్వర సంకల్పముచే బయలు వెడలెను.

స్థాన్కా యన్నను, ఆత్మారాముడన్నను, పరమాత్మ యన్నను, అల్లాయన్నను, పరిశుద్ధమై, ఏకమై, నామరూప రహితమై, అంతట వ్యాపించునదై, భేదరహితమై, ఉత్కృష్టమై, దివ్యమై, అపారవారమై, జగత్తునకు కారణంబై వెలయుచున్నది. ఇట్టి దివ్యనామమును మనసా ధరించువారలే మోక్ష సామ్రాజ్యమును బొందుదురు.

ఈ స్థాన్కా యను నామంబు ప్రపంచములోగల యే భాషలలో గలయక పోయినను శబ్దమాతృకచే వేత్తలు దీనిని ఉత్కృష్ట నామంబని అభిమానింప వచ్చును. ఎందుకనగా

"ఓమిత్యేకాక్షరబ్రహ్మం" బని వేదములు బలుకుటచే ఓం
యను ప్రణవమునకు శబ్దబ్రహ్మము లేక శబ్దమె పరమాత్మ
యని, హిందూమత సిద్ధాంతము, మరియు, అల్లా యనునది
దివ్యోత్కృష్టనామంబని మహమ్మదీయులు బలుకుదురు. ఇది
శబ్దముచే గలిగెను. గనుక దీనిని శబ్దబ్రహ్మ మనుట సంది
యము లేదు. గాడ్ యనునది దివ్యమైన నామంబని ఇంగ్లీషు
వారి అభిప్రాయము. ఇదియును శబ్దముచే గలుగుచున్నది
గనుక శబ్ద బ్రహ్మమనుటకు సందేహము లేదు. స్థాన్ యను
నామంబు దివ్యమైన శబ్దంబుతో గూడుకున్నది గనుక ఇది
యును ఉత్కృష్టంబేయని స్థాన్కావారు బలికెను. ఇవ్వి
ధంబున అనేకులు అనేక భాషలచే పరమాత్మ ధ్యానము
చేయుచున్నారు. సర్వనామంబులు శబ్దముచే ఏర్పడినవి గనుక
పరమాత్మునిఏభాషచేనైన, ఏనామముచేనైన దలంచవచ్చును.
ఇందు భేదమేమియు లేదు. అయినను అన్నిటికి తమ తమ
ఉద్దేశ్యములే ప్రధానమని, ఉద్దేశ్యముచేతనే తగుఫలము నను
భవమున కొచ్చునని నొక్కి వక్కాణింప వచ్చును. కావున,
ఓ మతిమంతులారా, స్థాన్కాయను నామమే మార్పు.
ఇందున మార్పులుండవు, నూగులలోనుండి నూనె వచ్చు
టయే మార్పు. నూనెలోనుండి మరియేమి మార్పులుండవు.
హిందూమతము వృక్షము వంటిది. ఇతరమతములు కొమ్మల
వంటివి. స్థాన్కా సమత్వము పండిన పండువంటిది, ఈ సమ
త్వము నవలంబించినవారు పండును భక్షించి తృప్తులగునట్లు
జన్మశూన్యులై హాయిస్థానమును బొందుదురు. గాన స్థాన్కా

సమత్వమును జన్మశూన్య మతమని బలుకవచ్చును. మత మను నానావిధంబు ప్రపంచమందుద్భవించెనో విమర్శించి హిందూమతము వృక్షము వంటిదనుటకు హేతువు జూపి, నొక్కొక్క మతమునగల ముఖ్యపద్ధతులను క్లుప్తముగా విమర్శించి ఆపై స్థాన్కాయొక్క ముఖ్యాభిప్రాయము దెలిపి భక్తులను దృఢమతులుగా జేసి, సందేహములనుదీర్చి మోక్షార్హులుగా జేయునని స్థాన్కావారు బలికెను.

# మతనామోద్భవంబు

నిస్సంకల్పమునుండి సంకల్పసృష్టి. సంకల్పమునుండి పంచభూతములసృష్టి. పంచభూతములనుండి చరాచరసృష్టి. (చర యనగా చర్మముతో గూడిన జీవులు. పిపీలికాది మనుష్య పర్యంతం) అచర యనగా, చర్మములేని జీవులు (పృథ్వి ఓషధాది సూర్య చంద్ర నక్షత్రమండల పర్యంతం) చరములలో నరచరులు సంకల్ప విశేషముచేత గమనాగమన మను జ్ఞానము గలిగి ఇది ఫలానిదను విమర్శ సామర్థ్యము గలుగుటచేత శ్రేష్ఠులైరి. ఇట్లు శ్రేష్ఠులైన నరచరులలో మరి కొంత సంకల్పము విశేషమై యాసంకల్పము దృఢపటుత్వముతో నిలచి మిక్కిలి విమర్శ సామర్థ్యంగల్గుటచేత యానర చరుడు దైవసంభూతుడని పిలువ బడెను. (దైవ-సం-భూతుడు) దైవమనగా నిస్సంకల్పము. సం= సంబంధించిన-భూతుడు=భూతములతో గూడినవాడు. ఇట్టినరచరుడగు దైవ సంభూతుని కేవలము దైవమని లేక నిస్సంకల్పుడని పిలుచుట

వాడు కాాయెను. (నిస్సంకల్ప మనగా సంకల్పము మిక్కుటమై మరికొంత ఎక్కువగుటకు సందు లేక పోవుటచేత నిలచి ముందున్న గతిని పొందెను. అనగా నిస్సంకల్పముతో ఐక్యమాయెను. ఇందు ఉదాహరణం:- నొక కూర్చున్న మనిషి లేచి ఎక్కువగా పరుగెత్తి మరికొంత దూరము పరుగెత్త లేక ముందుకూర్చున్న విధము నవలంభించి కూర్చుండెను. తద్విధముగా శుద్ధసంకల్ప మెక్కువై నిస్సంకల్ప మాయెను. ఇట్టి నిస్సంకల్పముతో జతగూడినట్టి నరచరులు బ్రహ్మ, విష్ణు, శివ రామ మొదలుగల 33 కోట్లకు పైబడు దైవసంభూతులు లేక దేవతలు వారి వారి దృఢసంకల్ప సామర్థ్యంచేత నానా విధ పద్ధతులను ఏర్పరచిరి. ఇట్టి నొక్కొక్క దేవతపై మమత గల నరచరులకు ఆయా మతస్తులని పిలువబడిరి. మమతయను పదమువలన మతమను నామము గలిగెను. ఇట్టి యీ నరచరులలో అనేక తెగలు గలిగి (తెగలనగా సంఘములు గలిగి) నొక్కొక్క సంఘమువారు నొక్కొక్క భాష, మతము ఏర్పరచుకొని వృద్ధిబొందిరి. ఇట్లు నొక్కొక్క సంఘమువారు విడిపోయి నొక్కొక్క దేవతపై లేక గురువుపై మమతుంచుటచేత మతస్తులని పిలువబడి యీభూప్రదేశమందు అనేక మతములు ఏర్పడినవి. యీమతములలో హిందూమతము, మహామ్మదీయమతము, క్రీస్తుమతము యీమూడు మతములు మాత్రము యీరాజ్యమునందు గనపడుచున్నవి.

## హిందూమతము

ఎక్కువసంఖ్యగల నరచరులు హిందూమతము నవలం

భించియున్నారు. హిందూమతము సనాతనమునుండి వచ్చు చున్నది. యీ మతము వృక్షము వంటిది, లేక తల్లివంటిది. యీ మతమునందె ఏసుక్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు, జరాస్టో కుడు, మరికొందరు మహనీయ నరచరులు జన్మాముల కొచ్చి కొన్ని కొన్ని హిందూమత పద్ధతులను నిరాకరించి కొన్ని కొన్ని పద్ధతులు స్వీకరించి వీరిచే యేర్పరుప బడిన పద్ధతులను అంగీకరించి ఆచరించుచున్న నరచరులకు వారి వారి నామంబు లచేపిలువబడునట్లుమతస్తులని ఆజ్ఞాపించి వెళ్ళిరి ఈనాటికి అచ్చు టచ్చుట యీ హిందూమతమందు మార్పులుగలుగుచున్నట్లు ఆర్యమతము, బ్రహ్మసమాజమతము యీ రెండుమతములు గనపడుచున్నవి. యిప్పుడు యీస్థాన్ కాసమత్వము పైవుదహరించిన మతముల సారాంశములతో గూడి సముమైన భావముచే సులభముగా మోక్షార్హులగునట్లు జేయునని స్థాన్ కావారు స్త్రీ పురుష అష్టాదివర్ణస్తులకు దెలిపిరి. ఇట్టి యీ హిందూమతము చిరకాలమునుండి వచ్చుటవలన దీనిని తల్లీ యనవచ్చును. కాని దీనిమూలము విచారించిన యెడల భిన్న భిన్న భావములు గలిగి మూలములేనట్లు దోచుచున్నది. యీ ప్రపంచసృష్టిని విచారించినచో నొకపురాణమందు ఆది శక్తి బుట్టి త్రిమూర్తులను బుట్టించెనని, యీ త్రిమూర్తుల వలన ప్రపంచసృష్టి గలిగెననియు, మరియొక పురాణమందు విష్ణుమూర్తి కమలమందు బుట్టి సర్వప్రపంచము సృష్టించెనని నొకటైనను సత్యములేక నానావిధ భిన్నభిన్న భావములు గలిగి యున్నవి. యిల్లాలు యెట్టిదైనది యిల్లుదెల్పు నన్నట్లు

మతమెట్టిదైనది మతసృష్టి దెల్పుచున్నది. ఇదియునుగాక విష్ణుపురాణమందు విష్ణుమూర్తి గొప్పనియు, శివపురాణమందు శివుడు గొప్పనియు బలుకుచున్నవి. శివునిపై మమతగల శివ మతస్థులు శివుడె గొప్పయనియు, విష్ణుమూర్తిపై మమతగల వైష్ణవ మతస్థులు విష్ణు గొప్పయని, దేవతలనబడు దైవసంభూతులలోనే భేదములు గలిగించి యాయా దేవతలయందు ప్రీతిగల నరచయులు రోషద్వేషులై నటించుచున్నారు. యాశివోష్ణువులను పుట్టించిన పరంధాముడున్నాడని దెలిసియు, ద్వైతులగుట లేక ద్వేషులగుట తెలివిహీనులే. మరియు ఒక హిందూమతములోనే బ్రాహ్మణులని, క్షత్రియులని వైశ్యలని, శూద్రులని నాలుగు జాతులు ఏర్పరచుకొని అందునొక జాతివారు నొకజాతిలో కలయ గూడదని, నొకజాతివారు నొకజాతివారిని ముట్టినచో స్నానము చేయవలెనని కొన్ని పద్ధతులు కల్పించుకొని శూద్రులు హీనజాతివారని వేదములు చదువగూడదని, వినగూడదని, మోక్షార్హులు కారని, మంత్ర పఠన కూడదని వారిలోవారు భేదములు కల్పించుకొని శూద్రులు చెట్లను, రాళ్ళను, బ్రాహ్మణులను మ్రొక్కవలెనని, షట్కర్మములు ఆచరించ వలెనని తెలియని వారికి బోధించి కపట కుటిలాత్ములు హిందూమతమునగల సున్నమైన పద్ధతులను రహస్యముగా నుంచిరి. మరియు యీనాలుగు జాతులలో నొక్కొక్కజాతి మరికొన్ని భాగములై వేరువేరు నామములచే పిలువబడు చున్నవి. నొక్క బ్రాహ్మణ జాతిలో శ్రీవైష్ణవులని, స్మార్థులని, శివద్విజులని, మురికినాడు, వెల

నాడు, ద్రావిడులు, ఆర్వేల, శుక్ల, యజుశ్శాఖ, నంద,
వైదీక, మధ్వ యని పిలువబడు చున్నారు. క్షత్రియజాతిలో
సూర్యవంశము, చంద్రవంశము యింకా అనేక వంశస్థులని
యున్నారు. వైశ్య జాతిలో కోమటులని, బేరులని యున్నారు.
శూద్రజాతిలో లెక్కకుమించిన నామములు గలిగియున్నారు.
ఒక్క యోనిచేపుట్టి ఒక్క మతము నవలంభించిన నరచరులు
యెన్నియో మార్పులుగా పిలువబడుట వలన సత్యమైన
మతము కాదని సందేహము కలుగుచున్నది. ఇట్టి సందేహ
మునకు కారణము యీయేర్పాటులు జేసిన అబద్ధ గురువులు
లేక దేవతలు కాపించిన పొరబాటులని దెలియుచున్నది.
నిజము విచారించినచో స్త్రీలని పురుషులని రెండు జాతులు
దప్ప మరి యేజాతులు లేవు. యీరెండు జాతులలో స్త్రీలు
గాని పురుషులుగాని జ్ఞానముతో గూడినవారు అగ్రజాతి
వారనియు, అజ్ఞానముతో గూడినవారు హీనజాతివారనియు
బలుకుట న్యాయము. ఇట్టి న్యాయపద్ధతి గుణములచే వచ్చు
చుండును. కొందరు తెలియనివారు బ్రాహ్మణ, క్షత్రియ,
వైశ్య, శూద్ర వీటిని జాతులు లేక కులములని పిలుతురుగాని
యివి నాల్గున్ను నాల్గువిధముల గుణములుగాని కులములని
చెప్పగూడదు. ఎందుకనగా నొకచెట్టులో పిందెలు, కాయలు,
దోర్గాయలు, పండ్లు నాల్గువిధములై యేర్పడును. ఒక్కొ
క్కటి ఒక్కొక్క రుచిభేదము కనపరచినట్లు ఒక్కసృష్టిలో
చేరిన ప్రతిదేహధారి స్త్రీపురుషులు పసిప్రాయము, బాల్యము,
యౌవ్వనము, వృద్ధత్వము నాల్గు దశలయందు గుణములు

భోదించినట్లు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనుట గుణములకే పేర్లుగాని కులము లనగూడదు. పిందెలు పండ్లు యగునట్లు, బాలురు వృద్ధులగునట్లు శూద్రయను గుణము బ్రాహ్మణ గుణమగుచున్నది, పిందెలు పండ్లుగా మారుట లేక పిందెలు పిందెలుగాయుండి వాడిపోయి రాలిపోవుట కొంత స్వభావికము గలదు. బాలురు వృద్ధులగుట లేక బాలురు బాలురుగా చనిపోవుట, శూద్రయను గుణము బ్రాహ్మణ మను గుణమగుట, లేక శూద్రయను గుణము మారకపోవుట కొంతసహవాస భేదమువలన యుండును. బ్రాహ్మణ,క్షత్రియ వైశ్య, శూద్ర యీగుణములు సర్వదేహధారులకు ఒక విధ ముగా యుండకుండుటకు స్వభావికముకొంతయున్న మన పెద్దలు భేదబుద్ధిచే జ్ఞానము బోధించకపోవుట కొంతయున్న కారణం బాయెను. కాబట్టి యీనాల్గు గుణములను కులములని భావించినవారు హీనజాతి వారగుదురు. అనగా అజ్ఞాను లగుదురు.

ఇట్టి యీనాల్గుగుణములను కులములుగా భావించుకొని అనేక చిల్లరనామములు కల్పించుకొని వారివారి దేవతలచే ఏర్పాటు చేయబడినట్లు ద్వైతులని, విశిష్టాద్వైతులని, అద్వైతు లని పేర్లుబెట్టుకొని వారివారి నియమ, నిష్ఠలు, మంత్రములు ఒకరిదొకరికి సంబంధము లేనట్లు యుంచుకొని భేదవాదులై చెడిపోవుచున్నారు. (1) ద్వైతులనగా దైవమును రెండుగా లేక అనేకులుగాదలచువారు (ద్వై) యనుపదము (ద్వ) యను టలో రెండని బలుకుట వలన (ద్వైతులనగా రెండుగలవారని

అర్థము. రామ, కృష్ణ, విష్ణు, శివ మొదలుగల దేవతలను ఆయా రూపములచే విగ్రహములుగాని, పటములుగాని చేసి పెట్టుకొని వీటియందె ఆయాదేవతలున్నారని ఒకదేవుని కన్న మరియొకదేవుడు శ్రేష్ఠుడని వారివారి దేవతల కొరకే పోట్లాడు కొనుచు, ఒకరునిడిబొట్టు బెట్టుకొనువారమని, మరియొకరు అడ్డ బొట్టుపెట్టుకొని, కొందరు విభూతిబూసుకొని, మరికొందరు శంఖు, చక్రము లనబడు దేహముపైగుర్తులుకాల్చుకొని, ఇంకా కొందరు శిఖాపవనమని శరీరమునకు అంత్యమైన మనస్సును త్యజించమని యుండగా శరీరమునకు అంత్యమైవని వెంట్రుక లని తలపై నుండెడు వెంట్రుకలను కత్తిరించుచున్నారు. ఇట్లు చేయుటవలన ఏమైన ఫలముగలదా? మనస్సును త్యజించుట వలన మానవుడగునని తెలియ వచ్చునుగాని తలవెంట్రుకలను కత్తిరించి కొద్దిగా పిలకజుట్టుయుంచుటవలన ప్రయోజన మేమియు గనబడదుగాని అందుమూలమున కొన్ని భేదములు గలిగి క్రోధులగుటకు కారణమగుచున్నది. దీని నేమతమని చెప్ప వచ్చును. ఈ పిలకజుట్టుపెట్టుటకు ఏర్పాటు చేసినది ఒక గురువు యని తెలియుచున్నది. మనుష్యులలో భేదముంచుట వలన తనవారని గుర్తుబడుటకు చేసిన యేర్పాటులని తెలియు చున్నది. యింకాకొందరు మెడలో బిళ్ళలు వేసుకొని పూర్వము మాయాగురువుల ఆజ్ఞప్రకారం పామరనరులు అనేక విధముల గుర్తులు ధరించుచున్నారు. యాగుర్తులుబెట్టగనే మనబుద్ధిస్థిర పడునా? యాగుర్తులుపెట్టనిచో మనబుద్ధిస్థిర పడదా? నిజము విచారించినచో మనముపామరులమని లేకద్విపాదపశువులమ

చూపట్టుటకై సమష్టిభావము లేని ద్వైతగురువులు లేక ద్వేష
గురువులు తాముగొప్ప వారమని తుచ్ఛమైన ప్రపంచ గౌరవ
మర్యాదలకై జేసిన ఏర్పాటులని స్పష్టముగా తెలియుచున్నది.
"Err is human" జన్మదుఃఖం బనునట్లు మనము పుట్టుకతోతప్పు.
తప్పుచేయని దెవ్వడు! మా పుట్టుకే తప్పాయని తప్పులు చేయుట
సరికాదు కాని తప్పును ఏవిధముననైన దిద్దితీర్చుకొనుట సరి
యైన మానవ తెలివియనబడును. ఎట్లన నొక భాష
నేర్చని కాలమందు మాట్లాడలేముకాని యా భాష నేర్చిన
పిమ్మట నిరాటంకముగా మాట్లాడుదుము, భాష నేర్చియు
నేర్చనివానివలె నటించుట అవివేకము. తద్విధముగా మానవ
శరీరములకు ఎరుక మఱుపులు సహజస్వాభావిక గుణములు.
గనుక మన ద్వైతగురువులు తెలిసియో తెలియకనో,
యోచించియో యోచించకనో జేసిన ఏర్పాటులు సవరణ
జేసుకొనుట ఉత్తమము. పూర్వులు జేసిన ఏర్పాటులు తీసి
వేసినచో అనిష్టయని గిలిపడియా ద్వైత భావము వదలనివారు
ద్వైతులు. చెట్లను, రాళ్ళను మ్రొక్కువారు ద్వైతులు. దేవుడు
ఒక్కడే యనుభావము తెలియని వారు ద్వైతులు. ఆలంబో
పాసకులు ద్వైతులు. భయభ్రాంతి కల్పితులు ద్వైతులు. తమ
వంటివానిపై ఆధారపడువారు ద్వైతులు. అతంత్రులు ద్వైతులు.
బ్రహ్మసాన్నిధ్యాధికారము చాలనివారు ద్వైతులు. అబలలతో
సమానులు ద్వైతులు. బ్రహ్మసూత్ర మెఱుగక నూలిపోగులు
మెడలో జుట్టుకొని బ్రాహ్మణుల మైతిమనువారు ద్వైతులు.
భక్తులు ద్వైతులు. జపములు, వ్రతములు, స్నానసంధ్యలు,

యజ్ఞములు, హోమములుచేయువారు ద్వైతులు. బ్రాహ్మణ స్మృతికర్తల మత ప్రకారము షట్కర్మము లాచరించుచు భూదానము, గోదానము, కన్యాదానము మొదలుగల దాన ములు చేయువారు ద్వైతులు. పితృదేవతలకు పిండాకూడు బెట్టువారుద్వైతులు. నరకస్వర్గపరముక్తులని భయకంపితు లగు వారుద్వైతులు. పరమాత్మడను పదమున కర్థము యెరుగని వారలు ద్వైతులు. ఉదయములేచి స్నాననిష్ఠలచే గీతాపారా యణము జేయువారుద్వైతులు. చచ్చుచు పుట్టుచు యుండు వారు ద్వైతులు. వ్రతనిష్ఠ మొదలుగల వాసన త్రయముల దగులబడి ఉత్తమజన్మ మెత్తవలెనను కోరిక గలవారు ద్వైతులు. ఒక జన్మతో కడతేరలేమనువారు ద్వైతులు. గాయత్రి మొదలుగల శైవ, శాక్త, వైష్ణవ, కాపాలిక, గాణాపత్య, సౌరాదిమతభేదములచే సప్తకోటి మంత్రములచే స్మార్తాది కర్మలయందును, గర్భాదానాది షోడశసంస్కార ముల యందును, యజ్ఞయాగాదుల యందును, వేదోక్త. పురాణోక్త మంత్రములను నోటజెప్పుచు, చేతులతో చర్వ్యాజ్య సమిదక్షు పుష్పచందన దర్భలాది పదార్థములచే అచ్చటచ్చట క్రియలు, నడిపించువారు ద్వైతులు. శ్రీరామ శివ, గోవింద, నారాయణ మహాదేవాది నామముల రాగ తాళ నృత్యవాద్యములతోడ హృద్యముగ భజనచేయుచు, ఆయాదేవతల నామములు కోటిసంఖ్యగా వ్రాయుచు (రాం కోటి వ్రాయుచు) ఆయాదేవతల నామములతోనే ఆయాదేవ తల రూపములు వ్రాయుచు దలచుట స్మరణమంత్రయోగము,

ఇందుకు శ్లోకము "సప్తకోటి మహామంత్రా చిత్తవిభ్రమ కారకః" యీలాగు మంత్రములందు చిత్తము భ్రమింపజేసు కొనువారు ద్వైతులు.

శ్లో॥ ఉత్తమంతత్వ చింతాన।మధ్యమం శాస్త్రచింతనం।
అధమం మంత్రచింతాన।తీర్థభ్రాంత ధమాధమ॥

అధముల కన్న అధములు ద్వైతులు. అనగా నిప్పు యోజకులు ద్వైతులు ఓం యను నాదము అండపిండ బ్రహ్మాండ చరాచరంబుల యుత్పత్తి స్థితి లయాదులకు ఆదియై అనాదియై యుండునని, సాక్షాత్పర బ్రహ్మమని

శ్లో॥ అకారంబ్రహ్మరూపంచ।ఉకారంవిష్ణురూపకం।
మకారంరుద్రరూపంచ।త్రిమూర్తిప్రణవాత్మకం॥

అని ఓంకారమందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు రజ సత్వ తమోగుణంబులు పుట్టినవని, సర్వప్రకృతికి ఆధారమై యున్నదని, ఓంకారమె బ్రహ్మమని అకార ఉకార మకార సంయోగంబున ఓంకారంబాయెనని, యిట్టి ఓంకారంబును నిత్యంబు శివయోగులు ఆత్మానుభవంబుగా నిత్యంబు భజింపు చుందురు. అది ఎట్లన సిద్ధాసనంబున కూర్చుండి నాసికాగ్ర మందు దృష్టినిలిపి ముక్కులను, చెవులను తర్జన్యుల రెంటితో మూసి ఓంకార ధ్వని వినుచుందురు. అట్లు వినగా వినగా గజ్జలధ్వని పిమ్మట ఘంటానాదం, శంఖునాదం, వీణానాదం, తాళనాదం, మేఘనాదం యింకను నాదించగా భ్రమరనాద

మినిపించునని యిదియే ప్రణవ నాదంబని కానిదాని భ్రమించి యీనాదమందు మనస్సు లయించుటె లయయోగంబని యీ ఓంకారమును ప్రణవ మూలంబెరుగనివారు ద్వైతులు.

శ్లో॥ ఆకాశస్యగుణశ్శబ్దశ్శబ్దబ్రహ్మముచ్యతే॥

యని శృతులు బలుకుచుండ వినిదెలసి శబ్దమె బ్రహ్మ మని బలుకువారు ద్వైతులు, 'ఓం' యను దీనిని ప్రణవమని, ఓంకారమని, ఉద్గీథమని, ఏకాక్షరమని, తారకమని, శబ్దబ్రహ్మ మని, ద్వైతులు బలుకుదురు. దీనిని దీర్ఘ స్వరముతో బలు కుట వలన ఉద్గీథమని పిలువబడెను. ఓంకారమె సర్వరక్ష కుండని ద్వైతులు ఉపాసించుచుందురు. యీ ఓంకారము ద్వైతులను పరబ్రహ్మమందు జేర్చునని భ్రమించెదరు. యీఓంకారమూలమును తెలియక యిదియే ప్రణవంబని అవి నాశియగు నఖండేశ్వరుడని ద్వైతమతస్తులు బలుకుదురు. "ఓం తత్సదితినిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః" ఓం, తత్, సత్, యీమూడున్ను భగవంతునియొక్క ఉత్తమ నామంబులని బలుకుట యొప్పుకొనదగును. కేవలము భగవంతులేయనుట యొప్పదగదు. ఐతే ఔపచారిక ధర్మమందు నొకసాధనము రూఢియగుటవలన దానిని సాధ్యవస్తువుతో నేకము చేయు నని బలుకుదురు. బలికినను వస్తువు ప్రత్యేకమై యుండుట సత్యము. సాధ్యవస్తువును ఎరుగక సాధనము చేయుట సరి కాదు. గనుక ఓంకారము పరబ్రహ్మముకాదు, పరబ్రహ్మ ముతో కలుపునను వట్టిభ్రాంతియె. ఓంకారమును బ్రహ్మ మనుట యెట్లున్నదనగా చెవులు వినుచున్నవి, నోరు మాట్లాడు

చున్నది, కండ్లు చూచుచున్నవన్నట్లున్నది. నిజముగా యీ యింద్రియములు రూపనులు జేయలేవుకాని ప్రపంచ గుర్తులకై అట్లు జెప్పుట వాడుకాయెను. యీ యింద్రియములకు ఆలాటిశక్తి యున్నయెడల కొందరికి యింద్రియములుండియు వ్యర్థమగుచున్నవి. మరియు శవమునకు యింద్రియములుండియు వ్యర్థమైనవి. ఎలాగు ఇంద్రియములు వ్యర్థమైనవో, ఆలాగె ఓంకారము వ్యర్థమాయెను. గనుక ఓంకారమును అవినాశి యనగూడదు. అవినాశి యనుటనే ద్వైతులు.

"ప్రణవోధనుఃశరోహ్యాత్మాబ్రహ్మతల్లక్ష్యముచ్యతే"

యీ శ్లోకమందు "ఓం"కారంబు అంబుయనియు, ఆత్మబాణమనియు, లక్ష్యము బ్రహ్మమనియు చెప్పబడెను. అంబు, బాణము, లక్ష్యము యీమూడుమూడువిధభేదంబులు కనపరచు చున్నవి. అంబు, లక్ష్యమగునా, కానేరదు. అంబును పోల్చినట్టి ఓంకారము బ్రహ్మమగునా. సర్వరక్షకుండగునా, కానేరదు. ఇట్టి బ్రహ్మస్వరూపము కానిదానిని బ్రహ్మమనువారు ద్వైతులు. ఇది బ్రాహ్మణ గ్రంథకర్తల మతము. మరియు పాతంజలియోగియును "తస్యవాచక ప్రణవః" అనగా పరబ్రహ్మమునకు ప్రణవమె నామధేయంబని చెప్పెను. పరబ్రహ్మము అనంత నామములచే నుండ ఓంకారమే నామధేయమనుటయు బాగుండలేదు.

"దేవశ్చేతిసంధత్తాంసర్వేభ్యోదుఃఖభయేభ్యః।
సంతారయతీతితారణాత్తారః॥

సకల దేవతలు ప్రణవమేయనియు, సకల దుఃఖభయములనుండి (సంసారమునుండి) తరింపజేయుటవలన తారణం మనంబడునని, తారణము చేయుటవలన తారకమాయెనని, తారక బ్రహ్మంబెరుగనివారు ఓంకారంబు తారకంబనుచున్నారు. ఇట్టివారే ద్వైతులు. ప్రణవము మంత్రరాజములకెల్ల శిరోరత్నమని, బ్రాహ్మణగ్రంథములు, యోగాది శాస్త్రములు, స్మృతులు, భగవద్గీత మొదలుగల గ్రంథములు బలుకుట వాస్తవమే కాని ప్రణవమూలంబెరుగక ఓంకారమే ప్రణవంబనుట సరికాదు. ప్రణవార్థము సంపూర్ణముగా గ్రహించినవారు ఓంకారంబె ప్రణవంబని బలుకరు. ఓంకారంబు పరబ్రహ్మంబని దీనిని నుపాశింపవలెనని, నొకమతస్థులు ఏర్పాటు జేసుకొనిన పద్ధతిదప్ప ఓంకారంబు పరబ్రహ్మంబు కాదు. ఓంకారంబు నుపాసింపంగనే మోక్షార్థులుకారు. ఇట్టిఓంకారమతము బట్టినివారికి దేవుడులేడా! మోక్షార్థులుకారా! దేవుడు అనంతనామములచే పిలువబడి నప్పుడు హెచ్చు తగ్గులేల! అన్నిభాషలు, అన్నినామములు, అన్నిరూపులు, పరబ్రహ్మమను సముద్రమందు సమత్వము బొందియుండునేగాని రాగ,ద్వేష,కపట, క్రోధ కుటిలంబులతో గూడి నొకటియు నుండదు. ఇట్టి గుణవర్జన లేక భేదమెంచువారు ద్వైతులు. మరియు "ఓం" యను దీర్ఘస్వరము "ఒ" అక్షరమునకు తలపైనున్న పొళ్ళుచేత గల్గుచున్నది. "ఒ" అక్షరముయొక్క తలసున్నచే గల్గుచున్నది. "ఓం" యాతల వలెనె అంత్యమందు శబ్దలయ స్థానం సున్నచే గల్గుచున్నది

గనుక "ఓం" అక్షరమునకు ఉత్పత్తియందు సున్నయున్న శబ్దలయమగునప్పుడు సున్నయున్న యుండుటవలన "ప్రణవ సర్వవేదేషు" యనుటకన్న "సున్నః సర్వవేదేషు" యనుట ఓంకారాక్షరమందర్థము సార్థకమగును.




మరియు "తైలధారావదిచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్ । అప్లుతం ప్రణవస్యాంతం॥ యస్తం వేదస వేదవిత్ " తైలధారవలె విచ్ఛిన్నంగానిదియు, ఘంటానాదమువలె దీర్ఘమైనట్టిదియు ప్రణవమందు అంత్యమునఅనగా ముగింపునందు ఏదికలదో దానిని తెలిసికొనినవాడు వేదవిదుడని యీ పైశ్లోకార్థము. ప్రణవముఅనగా

నాదము లేక శబ్దము. యీశబ్దమునకు ఓం యని పిలుచు
నప్పుడు ఓం యను దాని ఆదియందు అంత్యమందు అనగా
దాని పుట్టుకయందున్ను దానిముగింపునందున్ను యున్నది
"ం" సున్నయని తెలియుచున్నది. ఇట్టిసున్న తీసివేసినచో
ఓంకారరూపు నశించును, ఓంకారాక్షరరూపు నశించుటవలన
దానియందుశబ్దమున్ను నశించునుగనుక యీ తొలిపలుకునకు
ప్రధాన బీజాంకురమై జన్మస్థానమై ఉత్పత్తికి యోనియై వెలయు
చున్నదీసున్నయె. దీనిని అక్షరమని లేక నాశరహితమైన స్థాన
మని చెప్పవచ్చును. వేదముల యొక్క ప్రతి అక్షరమున్ను
సున్నచే ఏర్పడుచున్నది గనుక వేదముల యందు పరమేశ్వర
స్వరూపము సున్నయె. "ఓమితిబ్రహ్మ. ఓమితీదగ్ంసర్వమ్
ఓంకారమే బ్రహ్మము. ఓంకారమే సమస్తమనుటకన్న ఓం
కారమందలి సున్నయె బ్రహ్మము సమస్తము యని దెలుసు
కొనుటే వేదాంతము. వేదాంతమనగ వేదములకు అంత్యమై,
సారవంతమై కాకున్నదేదియో అదియే వేదాంతము. ఇట్టి
వేదాంతమార్గంబున ఓంకారాక్షరము విమర్శ నాచేరచియింప
బడిన "ప్రణవ పంచాంగ" మనెడు గ్రంథమందుగలదు.

నామ, రూప, నటనలేని పరబ్రహ్మ వీటికి విలక్షణుడు
గనుక యిట్టిభ్రాంతి పదవిని విడిచి యీనామ, రూప, నటన
లేని పరబ్రహ్మమును దెలుసుకొనుటయే జ్ఞానమార్గంబు. ఇట్టి
జ్ఞానమార్గంబునకు అనంతమార్గంబని, అపరోక్షంబని, అచ
లంబని, భావాభావాతీతంబని, సర్వశూన్యభావంబని, పరి
పూర్ణంబని పెద్దలు బలికిరి. ఇట్టి అ న ం త మా ర్గ ం బు

దెలియనివారికి జన్మ శూన్య మాట దుర్లభంబగాది సద్గ
ఇదిసత్యము, సత్యము, సత్యము. ఈ మార్గంబునకు అద్వైతమందించిన
మార్గంబని పేరుగలదు. గాని సర్వశూన్యభావంబున ద్వైతుల
అద్వైతమనుటయులేదు. అద్వైతమనగా "అ=లేదు,. "ద్వై=కారభ్రమ
రెండు "తము=మతము, అద్వైతమనగా రెండుకానిది. ఏలు. తన
రెండు లేని మతము. అనగా ద్వైవమును రెండు గాదలచి ద్వైతుల
వారు అద్వైతులు. యీ అద్వైతమార్గంబునకు అధ్యాత్మతుర్య
జ్ఞానంబని, బ్రహ్మజ్ఞానంబని, వేదాంతమని, అపరోక్షంబని మార్గ
అనంతంబని, అచలంబని, పరిపూర్ణంబని, భావాభావంబని తారణ శక్తి
నేతి నేతి మహావాక్యనిదర్శనంబని అనేకనామములు గలవు. ముఖ్య
ఈ మార్గంబునకు శూన్యమార్గంబని పేరుగలదు. ఇట్టి అద్వైతులు, ఆ
మార్గంబున ప్రవేసించినవారెట్టివారనిన జీవ, దైవ, సంధి నెరిగి విడి
వారు అద్వైతులు. స్వయంప్రకాశులు అద్వైతులు. దేవుడొకడు అ
ఒక్కడే యనువారు అద్వైతులు. జప, తప, హోమ, యాత్రలోల
దాన, ధర్మ, నిష్ట, నియమ, స్నాన, సంధ్య, వ్రత మొదలుగాగల
గల వాసనత్రయములు విడిచినవారు అద్వైతులు. ప్రపంచాసులమ
గౌరవమర్యాదలు, విషయభోగంబులు, విషముగా జూచిన ము
నడుచువారు అద్వైతులు. నిత్యపరసుఖానందంబున మునిగియుండువ
సమాదిస్థులైయుండువారు అద్వైతులు. సదాగురువుతోడుననివా
నేకమై తమంతటతాము ఆనందించుచుండువారు అద్వైతులు ఆత్మ
భేదాభేదంబు లెరుంగనివారు అద్వైతులు. సర్వప్రాణులకు రెరిగి
ఒక్కదృష్టితో జూచువారు అద్వైతులు. భయ, శోకవర్జితులైనవారు అ
అద్వైతులు. వర్జితులనగా ఎరుగనివారని అర్థము. శివుండుండువ

్యభంథుంాది సద్గుణంబులనియు, క్రోధాదిదుర్గుణంబులనియు రెంటిని అద్వైతంచినవారు అద్వైతులు. హెచ్చుతగ్గులు ఎంచనివారు ంబుని ద్వైతులు. పుట్టుగిట్టులులేవనువారు అద్వైతులు. మనో "ద్వైకార భ్రమరహితులు అద్వైతులు. మనస్సు లేనివారు అద్వై ది. తులు. తను, మను, ధనము గురువునకు సమర్పించినవారు దలళిద్వైతులు. నాదినీదను భేదమెరుగనివారు అద్వైతులు. అధ్యా తుర్వేదములు, అష్టాదశపురాణములు, యజ్ఞశిలాజిత్తులు, క్షుంజ మాంసాదిశాస్త్రములు, చతుషష్టికళలు, స్థూల, సూక్ష్మ ానంబ రణ శరీరంబులు, సప్తకోటి మహామంత్రములు, యోగాది గలః స్త్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతాది మొదలుగల గ్రంథ లు, ఆరుమతములు. మతములగల పద్ధతులుఎరుక భ్రాంతి ధి నెరి ని విడిచి నిశ్చలమతులై స్వర్గపరముక్తిభ్రాంతులురోసిన దేవ్పరు అద్వైతులు. పరబ్రహ్మమును అంతటజూచుచు ఆనం ను, యాబ్ధిలోలలాడువారు అద్వైతులు. ఒకప్పుడు తామె పర మొదటబ్రహ్మం బనుచు మరియొకప్పుడు తామె హీనులమనిదాసులకు ప్రపాసులమని నటించువారు అద్వైతులు. ఒకప్పుడు మూఢుల జ్ఞాన్న మూఢులై ఇది జ్ఞానము ఇది అజ్ఞానమునను విమర్శలేక మునటించువారు అద్వైతులు. ఒకప్పుడు మూర్ఖునివలె పట్టినపట్టు రువుటీడువనివారు అద్వైతులు. ఒకప్పుడు తెలివిలో తెలివియై వైతులయాత్మగ్రాహివలె సర్వవిమర్శజ్ఞానముగలిగి, తారతమ్యము ాణులకు తెరిగి సకలవిద్యలు తమయందె ఉత్పత్తియగునట్లు వర్తించు వర్తిచువారు అద్వైతులు. మరియొకప్పుడు ఏమి నెరుగని మొద్దువలె శిమయుండువారు అద్వైతులు. జడాజడ, జ్ఞానజ్ఞాన, న్యాయ

న్యాయములకు యొక్కరూపియై సమత్వముజూపు స్వభావము గలవారు అద్వైతులు.

ఇట్టిదట్టిదని నిర్దేశించుటకు అలవిగాని మనోమార్గంబున సంచరించువారు అద్వైతులు. గుణనిర్గుణములకు సాక్షియై నెలకొనువారు అద్వైతులు. భూషణ, దూషణ, తిరస్కారములను, సుఖదుఃఖములను, మానాభిమానములను ఒకటిగా నెంచువారు అద్వైతులు. తాననువాడు లేడని సంచరించు వారు అద్వైతులు. దేహాభిమానములు, ప్రపంచమర్యాదలు నొక గడ్డిపరకగా నెంచినవారు అద్వైతులు. స్త్రీ పురుషులను భేదమువదలినవారు అద్వైతులు. కోపమునకు కోపమున్ను, శాంతమునకు శాంతమున్ను జూపువారు అద్వైతులు. తిక్కలోని వారు అద్వైతులు. ఎరిగియు ఎరుగనివారివలె యుండువారు అద్వైతులు. తమవారని ఇతరులని భేదమెంచని వారు అద్వైతులు. గురుశిష్యరహిత భావంబెరింగిన వారు అద్వైతులు. ప్రపంచభోగంబులం దగిలియు దగలకయుండు వారు అద్వైతులు. సంసారమందుండియు, యుండకుండు నట్లుండువారు అద్వైతులు. నిద్రబోవుచు నిద్రబోనివారివలె యుండువారు అద్వైతులు. తినియు తిననివారివలె యుండు వారు అద్వైతులు. ఒకప్పుడు తిండి బోతువలె తినుచు మరియొక్కప్పుడు ఉపవాసముండువారివలె యుండు వారు అద్వైతులు. ఒకప్పుడు ఏడ్చుచు మరియొకప్పుడు నవ్వుచుండువారు అద్వైతులు. ఎండ, గాలి, వాన, చలియనక శీతోష్ణములను నేకముగా జూచుచు యుండువారు అద్వై

తులు. ఒకప్పుడు వాగ్భోత్తువలె మాట్లాడుచు, మరియొక ప్పుడు మూగివానివలె మౌనిగానుండుచు వారి ఇచ్ఛప్రకారము నటించుచుండువారు అద్వైతులు. ఇట్టిచేష్టలు జూచువారికి మహాత్ముడనుటకున్ను, తిక్కవాడనుటకున్ను తోచకుండును. కొందరు మంచి చెడ్డయను విమర్శజ్ఞానము లేనివారు అద్వైతు లిట్లగుదురందురు. అది తప్పు. అట్లనగూడదు, ఎందుకన విత్తు వృక్షమై తిరుగా విత్తై వెలయునట్లు, బాలుడు వృద్ధుడై తిరుగా బాల్యావస్థను బొందునట్లు, అజ్ఞాని జ్ఞానియై అజ్ఞానియగు చున్నాడు. జ్ఞాని అజ్ఞానికాడు. వృద్ధులు బాలురు గారు కాని గుణములు భేసించుటచే వ్యవహారమున చెప్పవలసియున్నది. గనుకనే అద్వైత భావజ్ఞులు బాలోన్మత్త పిశాచ దుఃఖములచే దిరుగుచుందురని పెద్దలు నచియించి యున్నారు. ఇట్టి అవస్థాత్రయంబున మంచి చెడ్డ విమర్శయుండదు కావున జ్ఞాని అజ్ఞాని గావలసెనని చెప్పబడెను. ఈ అధ్యాత్మ జ్ఞాన మార్గంబును తల్లియని చెప్పవచ్చును. ఏలననగా తల్లి తనకు పుట్టిన బిడ్డలలో నొకడుజారుడు, నొకడుజ్ఞాని, నొకడురాజు, నొకడుగుడ్డివాడు, నొకడుమూగివాడు, నొకడుపాండురోగి, యీవిధంబున ఎందరెన్ని విధములచే పుట్టియున్నను నిష్పక్షపాతియై అందరియందు సమమైన ప్రేమయుంచును, తనగర్భవాసమందు పుట్టినవారు గనుక అందరు నాబిడ్డలే యనుచుండును. తద్విధముగా జారుడైనను, నరహత్యజేసిన వాడైనను, జైలులో పడినవాడైనను, మోసకృత్యములు నేర్చిన వాడైనను, బొత్తిగాచదువురానివాడైనను, బాగుగా చదువు

నేర్చిన పండితుడైనను, దరిద్రుడైనను, రాజైనను, కేవలముహీన జాతి వాడైనను, మిగుల శ్రేష్ఠమైన అగ్రజాతి వాడైనను, హిందూమతస్థుడైనను, మహమ్మదీయ మతస్థుడైనను, అద్వైత మార్గంబగు వేదాంతంబున ప్రవేశించినచో "ఒక పెనామముచే మహాత్ముడనిగాని, సాధువుయనిగాని, జ్ఞానియనిగాని పిలువ బడుచు ప్రజలచే ప్రేమింపబడు చున్నాడు. ఆహా ఇట్టిమహాత్తు గల జ్ఞానమార్గంబు యేమహానీయుండు కనిపెట్టెనో యా మహాన్యుని గదా కొనియాడ వలసినది. ఆహా జ్ఞానమా తల్లి మానాభిమానములు యెంచనిదానవు. దరిదారెరుగక బ్రతుకే లేని వారిని అన్నపానీయంబులు సుఖముగా నిప్పించు దానవు. ప్రజల ప్రేమనాకర్షించు దానవు, అణిమాద్యష్టైశ్వ ర్యంబులు నిప్పించు దానవు. కోరినకోరికలు నెరవేర్చు దానవు. పరమాత్మునిగా జేసి పూజలు నడుపుదానవు. దరిద్రుని ధని కునిగా జేయుదానవు. దుఃఖమును పోగొట్ట శాశ్వత సుఖ మును యిచ్చుదానవు. సాగరంబున మునుగువారిని తేల్చు దానవు. మేరువువంటి బరువును గడ్డిపరకవలె తేలిక జేయు దానవు. నరుని హరుని జేయుదానవు. గర్వమును నీరు జేయుదానవు. నీమరుగు గననివాడు, నీలో ప్రవేసించని వాడు బుద్ధిహీనుడు, దరిద్రుడు, దురాత్ముడు గదా నిన్ను పోగొట్టుకొనువాడు స్వజీవహంతకుడుగదా. ఆహా! జ్ఞానమా తల్లి, పామరులు నానావిధవిషయ లోలురై, గుచులుగోరుచు, స్త్రీసంగమాదులచె, కొట్టుతిట్టులచే, రోగబాధలచే చెడుతిరు గుచు చచ్చుచుందురు గాని నీదయాసాగరంబున మునింగినిత్య

బుద్ధులై పరిశుద్ధులై యుండనోరరుగదా. ఇందుకేగదా పెద్దలు
నీలో ప్రవేశించి నీప్రేమబడయక వారిని ద్విపాద పశువులని వచి
యించియున్నారు.

ఓ మనుష్యులారా! పశుత్వము వదలి జ్ఞానమాతల్లి
యొక్కదయకు పాత్రులుకండి. లెండి, త్వరపడుడి, అద్వైతమే
ఆత్మానుభవానందము. యీ మార్గంబున ప్రవేశిం
చనివారు మానవశిశులుగానేరరు. అనగా మనుష్యులుగానేరరు
యని నా అనుభవమున బలుకుచున్నాను, నరుడునారాయ
ణుండను భావము అద్వైతము. నరుడునారాయణుండుకాడను
వారు విశిష్టాద్వైతులు. ఆత్మపరమాత్మల భేదమెంచువారు
విశిష్టాద్వైతులు. అద్వైతమార్గమునకు వ్యతిరిక్తముగా బలుకు
వారు విశిష్టాద్వైతులు. ద్వైతులకున్న విశిష్టాద్వైతులకు
కొద్ది భేదముకలదు. "వి" యనగా మంచి "శిష్టా" యనగా
శిష్యులు-ద్వైతమనగా ద్వైవమును రెండనుట, విశిష్టాద్వైత
మనగా ద్వైతులలో అగ్రగణ్యులని లేక శ్రేష్టమైన ద్వైత
భావముగలవారని లేక దైవమును రెండుగా దలచుటలో
పట్టుదలగలవారని అర్థమగుచున్నది. యీ విశిష్టాద్వైతులు
విష్ణుమూర్తిని దప్ప యితరదేవతలను పరమాత్మ స్వరూపావ
తారమని చెప్పరు. విష్ణుమూర్తి ఒక్కడె పరమాత్మ స్వరూప
మని బలుకుదురు. రూపునామము లేని పరబ్రహ్మము దుష్ట
శిక్షణ, శిష్టరక్షణార్థమై ఆయుధముచేతబూని లక్ష్మీపతియై పురు
షావతారము నెత్తినాడని "శ్లో॥ నతేరూపం నచాకారం
నాయుధానిచనాస్పదం। తథాపిపురుషాకారో భక్తానాంత్వం

ప్రకాశనె॥ నామరూపములేని పరమాత్మ దుష్టశిక్షణ, శిష్ట రక్షణార్థమై ఆయుధము చేతబట్టి లక్ష్మీపతియై పురుషాకారమును దాల్చినాడని విశిష్టాద్వైతులు పలుకుదురు. యీ భావము జూచిన యెడల పరమాత్మకు రూపునామక్రియాకారాన్యమనుట వాస్తవం బాయెను. అయితే విశిష్టాద్వైతులు, రూపములేని వాడు రూపునామము ధరించు ననుట భక్తికొరకేగాక సత్యముగా పరబ్రహ్మము రూపునామ రహితుండని పైశ్లోకమందు తెలియుచున్నది. మరియు ఓంకారమునందలి ఆకారమును లుప్త చతుర్థి యని పరమాత్మకు ఆత్మ శేషభూతమని,

శ్లో॥ అకారేణోచ్యతే విష్ణుః। సర్వలోకైక నాయకః।
ఉకారేణోచ్యతే లక్ష్మీ। ర్మకారో దాసవాచకః॥

యని అకార ఉకార మకారములు విష్ణుని సంబంధించి నట్లు బ్రహ్మ సంహితమందు చెప్పబడినట్లు నిరూపించెదరు. ఇదేవిధముననే తత్వమసి యను మహావాక్యార్థమును ఖండించ జేయుచు అసి పదమునకు వ్యతిరేకముగా హాస్యమాడుచు యెంత ప్రయాసపడినను నీవు పరమాత్మకాజాలవు కాని దాస అనంతాది గుణములలో నొకడవగుచున్నావని బలుకుదురు. ఇదియే విశిష్టాద్వైతుల ముఖ్యాభిప్రాయము. ఇట్లు ఒక మతములో వారు ఒకరి భావమును ఒకరు తిరస్కరమాడుకొనుచు అనేక భేదములచే వర్తించుచున్నారు. మరియు యీ హిందూమత మనెడు వృక్షమునకు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము యీ నాల్గువేదములు నాల్గు కొమ్మలుగా నియమింపబడియున్నవి. యీ వేదములు

హిందూమతమునంగల పద్ధతులు తెలుపుచున్నవి. అయితే యీ వేదములు దెలుపునట్టి సారాంశము జూడ ఖండా ఖండములై, నొక వేదములోగల విషయము నొక వేదముఖండించి సంబంధము లేనట్లు దెలుపుచున్నది. గనుకనే మానవులు సంశయ మనస్కులై, తర్కవాదులై దృఢనమ్మిక లేక చెడిపోవుటకు హేతువాయెను. వేదములు బలుకు సంగతులు గొప్పవేకాని యీ వేదములు కావించినట్టి సత్పురుషుల అభిప్రాయము దెలియులేక భేదవాదులై చెడుచున్నారు. యీ నాల్గు వేదములలో నొక్కొక్క వేదములో గల వేదాంత మహావాక్యములు కొద్దిగా వివరించినచో వీటి యందుండు భేదములు మదికొచ్చును.

1. ఋగ్వేదము జ్ఞానకాండమునందు:— తైత్తరి ఉపనిషద్మహావాక్యము "ప్రజ్ఞానంబ్రహ్మ" మని బలుకుచున్నది. "ప్రజ్ఞ" యనగా చైతన్యము. బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపమని బలుకుచున్నది. పిపీలికాది మనుష్యపర్యంతం కదలికయును పెరుగుటయును దేనియందున్నదో ఆకదలికే బ్రహ్మస్వరూపమని ఋగ్వేదము బలుకుచున్నది.

2. అజుర్వేదము జ్ఞానకాండము:— ఐతరి ఉపనిషద్మహావాక్యము "అహంబ్రహ్మాస్మి" యని బలుకుచున్నది. అహం=నేను, బ్రహ్మ=పరబ్రహ్మ, అస్మి=అయితిని యని దెలుపుచున్నది.

3. సామవేదము, జ్ఞానకాండము:- ఛాందగ్యోపనిష ద్మహా వాక్యము "తత్వమసి" యని బలుకుచున్నది. తద్=అది, త్వం=నీవు, అసి=ఆయితివి యని దెలుపుచున్నది.

4. అథర్వణవేదము జ్ఞానకాండము:- ముండకోపనిష ద్మహా వాక్యము "అయమాత్మబ్రహ్మ" మని బలుకుచున్నది. అయం = అంతటవ్యాపించిన, ఆత్మ = పరిశుద్ధగుణము, బ్రహ్మ=పరబ్రహ్మమని దెలుపుచున్నది. వీటియందుండు రహస్యములు దెలుసుకొనుటకె గురువుగానలెనని పెద్దలు బలికిరి. యీ నాల్గు మహావాక్యములు దెలుసుకొనిన పిమ్మట ఒకటగుచున్నవికాని, సంపూర్ణముగా వీటిఅర్ధము బోధపడిన పిమ్మట మనస్సు ఏవిధముగ దృఢపడునో ఆవిధ ఫలప్రాప్తి గలుగును. యీ నాల్గుమహావాక్యములు సర్వమనుష్యులకు నాల్గువిధ మనస్సులుండుటవలన ఎవరి మనస్సుకు తగినట్లు వారు నడుచు కొందురు గాక యని పెద్దలు యేర్పరచిరి. వీటిరహస్యము దెలిసినంత వరకు నాల్గున్న నాల్గుభేదములుగా గనపడును. వీటిరహస్యము దెలసినవారు జ్ఞానులు. దెలియనివారు మూఢులు. యీ నాల్గువేద ప్రమాణములనుబట్టి అష్టాదశ పురాణములు, యజ్ఞశిలాజిత్తులు, మీమాంసాది శాస్త్రములు, యింకా అనేక ప్రబంధములు గావించి అందు మూలంబుగా జీవుడని, దేవుడని, నరకమని, స్వర్గమని, పాపమని, పుణ్యమని, ఆగామి సంచిత ప్రారబ్ధకర్మములని, దుష్కర్మయని, సుకర్మయని, మిశ్రమ కర్మయని, దేవతలని, శక్తులని, నిర్గు

లని, తిరునాళ్ళని, గుడియని, గోపురంబని, సప్తకోటి మహామంత్ర, తంత్ర, యంత్ర, జప, తప, హోమ యజ్ఞంబులని అనేకవిధపేర్లు పెట్టుకొని జ్ఞానోపాస్తి, చక్షో పాస్తి, ధారోపాస్తి, హంసోపాస్తి యని నాల్గువిధ ఉపాసనలు ఏర్పరచిరి. అందు

జ్ఞానోపాస్తి యనగా మంత్ర, తంత్ర, జప, తప,హోమ, యజ్ఞము, నీతి, నియమ, నిష్టలు,బావులు త్రవ్వించుట,వనములు వేయించుట, తీర్థయాత్రలు సేవించుట, తల్లి,దండ్రి, గురువు,దైవమని భయభక్తి శ్రద్ధలచే ప్రేమించినటించుట, యీలాంటి సత్ప్రవర్తనలతో కూడుకున్నది జ్ఞానోపాస్తి లేక జ్ఞానోపాసన.

చక్షోపాస్తి, ఖేచరి, భూచరి, షణ్ముఖి, శాంభవి మొదలు గల పంచముద్రలను యిరువైయైదు ముద్రలుగా జేసుకొని శరీర శోధన యగు భూతపంచీకర్ణి, నేత్ర పంచీకర్ణి, ఘటదీపిక యను శరీరావయవములను శోధించుచు భ్రూమధ్యస్థాన, త్రిపుటస్థాన, శృంగాటస్థాన, నాశిక స్థాన, హృదయస్థాన, నాభిస్థాన మనియు చంద్రునినీడయందు సూర్యుని నీడయందు చాయా పురుషవిద్య యని నీడలజూచుచు హస్తముష్టికయోగ మని అనేకులు పడరాని బాధలతో కష్టపడుచు చూపు నిలుప వలయునని మనస్సు నిలువకున్న నేత్రములు చేసుచుకొనుచు నశించుచున్నారు. ఇదియే చక్షోపాసన లేక చక్షుల ఉపాసన.

3. ధారోపాస్తి యనగా, ఆధార, స్వాధిష్ఠ, మణిపూరక, అనహాత, విశుద్ధ, ఆగ్నేయ, సహస్రార మొదలుగల ఏడు చక్రములకు ఏడులోకములని వీటికి దిగువ యుండు తలాతల పాతాళమనబడు ఏడుచక్రములకు ఏడులోకములని, యీ ఏడేడు పదునాల్గులోకములు శరీరమందెయుండునని గణపతి క్రియాశక్తి అర్ధచంద్రకాంతితో నాల్గుదళములతో గుద, గుహ్యామునకు పైగానున్న దాధారచక్రమనియు, దానికిపైగా బ్రహ్మజ్ఞానాశక్తి ఆరుదళములతో ఆవరించి యున్నది స్వాధిష్ఠచక్రమనియు, విష్ణుయిచ్ఛాశక్తి పది దళంబులు గలిగి ఝుంకారనాదముతో ప్రకాశించు చున్నది మణిపూరక చక్రమనియు, రుద్రమూర్తి పరాశక్తి పండ్రెండు దళములతో ప్రజ్ఞానమయమై, శబ్దమునకు మూలమై, యాటపాటలకు కర్తయైయున్నది అనహాత చక్రమనియు, దానికి ఆవల పదహారుదళములతో ఈశ్వరుడుఆదిశక్తి సర్వావయవములకు, డెబ్బదిరెండు వేలనాడులకు. సప్తధాతువులకు, ప్రజ్ఞ కలుగజేయుచు, లింగస్వరూపముగా జీవుడు మలినరహితుడైయుండునది విశుద్ధచక్రంబనియు, దానికిపైగా ప్రణవపీఠంబున, గంగ, యమున, సరస్వతి మధ్యనాదముతో వీణవేణు నాదముతో రెండుదళములు గలిగి సూక్ష్మరూపియై సదాశివుడు తత్వభూత, జారుకాంత, యోగగుమ్మతో వ్రేలాడుచున్నది ఆగ్నేయ చక్రంబనియు, దానికావల సహస్రారమణిరత్న పీఠంబని అచ్చట వేయిరేకుల కమలమందు అష్టాక్షరి

యను అష్టబీజంబులతో "ఓమిత్యేకాక్షర బ్రహ్మ" మను గురు స్వరూపము జోతిర్మయమైయుండునది సహస్రారమునియు, దానిపైగా కోటి సూర్యప్రకాశమనియు, అర్ధనారీశ్వరుండనియు, ముక్తి కాంత సుదర్శనమనియు, అండపిండ బ్రహ్మాండముల జుట్టి నిర్వికల్ప మహాసమాధిలో మునింగి రేచక, పూరక, కుంభక ప్రాణాయామముచే దశవాయువులను స్వతంత్రించుకొని శరీరావయవముల నాడులలో ప్రాణమును దీసి సహస్రారమను శిరస్సున జేర్చుకొని వాయువు, మనస్సు, చూపు ఒకటిజేసుకొని అంతరాంతస్థుడైయుండునది ధారోపాస్తిలేక ధారణ యోగోపాసన యనబడును. ఇట్టి యోగసిద్ధాంతిస్వతంత్రుడని గురుస్వరూపుడని, పూజార్హుడని చెప్పవచ్చును.

4. హంసోపాస్తి యనగా ప్రాణ, వ్యాన, అపాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కుక్కుర, దేవదత్తను, ధనుంజయ వాయువులకు ఏకమై ఆడుచు ఆడించుచున్న ప్రాణవాయువు. నదియె నాశిక ద్వారా ఆడుగాలి. నిదియే హంసోపాస్తి లేక హంస ఉపాసన యనబడును.

యీనాల్గు పాస్యములకున్ను అతీతమై స్థూల, సూక్ష్మ కారణ, మహాకారణ శరీరములకున్ను, సర్వజీవ కోటికిన్ని, రూప నిరూపములకు అతీతమై అకార, ఉకార, మకారముల కున్ను, పంచకోశములకున్ను, స్వప్న, సుషుప్తి, జాగ్రద వస్థలకున్ను, ద్వాదశాక్షరి, షోడశాక్షరి, దశపంచాక్షరి, మంత్రమూల మంత్రార్థములకున్ను అతీతమై, మూలమై,

కళ, నిష్కళలకు ఆవరించుకొని నిరాభాసమై ఏకమై, ఆవరణ రహితమై, ఇహాపరములకు కారణమై, అవాఙ్మానస సగోచరమై ఏమిగాక, ఏమిలేక, అచలముగాక, నామరూప రహితమై సింధుసముద్రము రీతిగానుండు నది జీవన్ముక్తికి మూలము. జీవైక్యసంధానము. గురుమూర్తియొక్క అతి రహస్య సంపూర్ణజ్ఞానమని పెద్దలు నొకదానికన్న నొకటి హెచ్చుగా యున్నట్లు దెలిపిరి. మరియు ఇంగ్లీషు డిపార్టు మెంట్లవలె బ్రహ్మచర్యంబని, సన్యాసంబని, గార్హస్థ్యంబని, వానప్రస్థంబని నాల్గువిధముల పద్ధతులు డిపార్టుమెంట్లవలె గావించిరి. భక్తియోగము, జ్ఞానయోగము, సన్యాస యోగము, కర్మసన్యాసయోగము, కర్మయోగము, విభూతి యోగము, అక్షరపరబ్రహ్మయోగము, మొదలుగల పద్ధతులను ఖండాఖండముగా నియమించిరి. యమ, నియమ, ఆసన ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ,సమాధి, అష్టాంగ యోగములు సిద్ధపరచిరి.

ఈ విధంబున హిందూమతమున ఒకమార్గము యనక అనేకవిధమార్గంబులు ఏర్పరచి ప్రజలకు సందేహములు కలుగ జేసిరి. కొందరు మనోవృత్తులను దెలుపువారును, మరి కొందరు మోక్షము సద్గురుకటాక్షంబున క్షణలేశంబున సుల భముగాని కష్టమైన యోగాభ్యాసంబున లేదనువారును, కొందరు వాయునిరోధంబైన యోగాభ్యాస బలంబు లేక మనోవృత్తిని జయించరాదనువారును, జీవపరైక్య భావంబున పవన సంకల్పము ప్రయాసంబుగా నిల్చుచుగాని ప్రయాసంబు

రోగము కలుగ జేయుననువారును, రోగంబులకు దప్పిన వాయు నిరోధయోగ ఫలంబధికాయుర్మహత్వంబను వారును, యా మాయామహత్వ మహిమలు సిద్ధక్రియా మూలికామణి మంత్ర తపస్సిద్ధులంగలదను వారును, శివాగమ ప్రోక్తంబైన మంత్రలయరాజయోగంబు శివపంచాక్షరి యుక్తంబై కల్పితాకల్పిత మాలికజపంబున లయంబైన యజపా మార్గంబున ప్రవేశించి బాధత్రయ రేచక, పూరక, కుంభకంబులం గుంభించి కర్మాష్టాంగ హఠయోగ ప్రయాసంబున అష్టైశ్వర్య యుక్తుండగుచు ఈశ్వరానుగ్రశక్తిని సదాచారానుగ్రహంబున సాంఖ్యతారకంబుల మీరి కేవల కుంభకంబైన రాజయోగంబున, జాగ్రత స్వప్నసుషుప్తుల నతిక్రమించి నిష్ప్రపంచంబైన వెన్నెల బయలు ననుసరించి అనందసముద్రంబున మునింగి తెరువు మరపు తలంపు స్వరూపానుసంధాన ధ్యాన జపంబులు లేక యమనస్కంబైన తుర్యంబున ఎరుకజెడక తన్నుతాగను చతుర్విధయోగ రహస్యంబులం దెలుపువారును, వేదాంత శాస్త్రంబుల నిరామయ నిరాభాస నిర్వికల్ప నిష్ప్రపంచంబైన సనాతన బ్రహ్మావిదంశంబున రజ్జుశుక్తి స్థాణువులలేని మాయాప్రపంచంబు దబ్బరయగుటంజేసి మాయా మానస విభ్రమంబున తన్నెరుంగుటంజేసి జీవుడు బద్ధుండగు నీబంధముక్తులు నాత్మకులేవు సంకల్పస్వభావంబులనువారును యాత్మసాక్షాత్కార పరుండైన కారణగురుండు కాలసంప్రాప్తమందొచుననువారును, కర్మముక్తులు మహాసంకల్ప భోగంబుల గలదను వారును, సద్భక్తినిగాని ఈశ్వరానుగ్రహ

జ్ఞానంబులు లేవనువారును, ఈవిధంబునమానవులు పరి పరివిధ పరి వేష్టితులై

సీ॥ అవును కాదటంచు నాత్మను గనలేక,
మంత్ర యంత్రములను మగ్నులగుచు
సంశయంబుచేత చచ్చిరిగదరయా
విశ్వదాభిరామ వినురవేమా॥

యని వేమనార్యుల వచనంబువలె నిజమబద్ధమార్గంబులంగన్పట్టి నమ్మటం మదినొప్పక సంశయాస్పదులై పునర్జన్మ ప్రాప్తులగుటంబట్టి సర్వమత మతాంతరంబులంగలమూలగుట్లు నెరింగి, మానవ శ్రేష్ఠులంగల సంశయంబులు నివర్తింపంజేసి పునర్జన్మ శూన్యులుగాజేయుటకు నవతరించిన స్థాన్‌కావారు మతములలోగల మర్మంబులు దెలుపుచు ప్రజలను పావనులుగా జేయుచున్నారు.

ఈ హిందూమతమున డాగియున్న రహస్యపద్ధతులను కొందరు మహనీయ మూర్తులు క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు మొదలుగా గలవారు పరోపకారంబు చేయదలంచి జ్ఞానమార్గంబు సర్వజనులకు తెలియజేసి తమతమ పద్ధతులను స్వీకరించినట్టి సంఘుంబులకు తమతమ నామంబులచే మతములని ఏర్పరచిన పిమ్మట, యాహిందూమతములో చేరిన పెద్దలు నిద్రబోయినవారు లేచినట్లు మేలుకొని హిందూమతమను నామంబు శూన్యంబగునని మదిదలంచి, వేదాంత సిద్ధాంతంబను నిరాలంబోపాసన ప్రజలకు దెలియునట్లు తత్వ

జ్ఞానంబని ప్రజలకు దెలియపరచిరి. ఇట్టి వేదాంత మార్గంబగు నిరాలంబోపాసన యుండుటవలన హిందూమతమను నామంబు శాశ్వతంబాయెను. ఇప్పటికి కొందరు మాయా గురువులు యీ పూర్వ విగ్రహారాధన, పూజ, స్నాన, వ్రత, నిష్ఠ, నియమ, భక్తి మొదలుగల దురాభ్యాసంబులు తాము పూజింపబడుటకు ఆశపైగొని, వున్నది వున్నట్లు దెల్పక మతమునంగలాభిమానంబిడువలేకనో లేక ఆత్మ పరమాత్మలయందు విచార జ్ఞానముచాలని కారణంబుననో శిష్యులను పునర్జన్మప్రాప్తులగునట్లు బోధించి ప్రజలయొక్క జీవితమును నాశనము జేయుచున్నారు. వేదాంతగురూక్త మార్గంబగు తత్వజ్ఞానంబు శ్రేష్టంబని మనహిందూమతవాదులు జెప్పుటయుగాక ఎక్కువ సంఖ్యగల స్వతంత్ర గ్రంథములు ఘోషింపుచున్నవి. గ్రంథములు బలుకుచున్నవనడమేల, మనచిన్న తెలివితో గమనించిన ఎడల ఒకవస్తువును తాము భక్షించి రుచిదెలుసుకొనుటకున్ను, మరిఒకరు భక్షించి రుచి ఇట్టిదనిన యారుచిని దెలుసుకొనుటకున్ను యెంత భేదమో యోచించుడి, మరిఒకవిధము. బిడ్డను కని పెంచునట్టి తల్లిప్రేమకున్ను, బిడ్డనుదెచ్చుకొని పెంచుకొనునట్టి తల్లిప్రేమకున్ను ఎంతభేదమో, యదార్థము దెలిసి భజించునట్టి జ్ఞానికిన్ని, దేవుడున్నాడను విశ్వాసిచేత భజించునట్టి భక్తునికిన్ని అంతభేదమున్నది. ఇందుకు వేమనార్యుల యభిప్రాయము.

గీ॥ విన్నవానికన్న కన్నవాడధికుండు కన్నవానికన్న
కలయువాడు। ఉన్నతోన్నతుడై యుర్విలోపలనుండు
విశ్వదాభిరామ వినురవేమ॥

ఈ పద్యార్థము దేవుడున్నాడనివిని దలచువాడుభక్తుడు.
కని (జూచి) దలచువాడు జ్ఞాని మరియు

గీ॥ అక్షరంబెరుగని ఆచారమదిఏల ॥
తాను తిననియట్టిధనమదేల ॥

యని వేమనార్యులు జెప్పినట్లు రామ, కృష్ణా, గోవిందాయని ఎంతగా మొత్తుకున్నను కాకివలె నీళ్ళలో మునిగినను, ఉపవాస, వ్రతములు ఎన్ని జేసినను ఫలము లేదు కాని యా పరమ పదంబెరింగినచో ఆచారము సార్థకంబగును. మరియు తన్నుతాగన్నట్టి సత్పురుషులు కొండ గుహాలలో యుందురని ప్రజలకండ్లకు కనపడరని, కొందరు పామరులు దలచుదురు. ఈవిధంబున దలచువారు అజ్ఞానులు. ఎందు కనగా నొకధనికుండు గ్రామము మధ్యయుండునని, గ్రామము వెలుపల యుండునని లేక పెద్దమేడలో యుండునని నేమైన నిష్కర్షలున్నవా, యుండనేరవు. ధనికుండు కోరినచోట యుండగలడు, అందు నిర్బంధమేమియుండదు. ఇందుకు వేమ నార్యుల యభిప్రాయము

గీ॥ ధ్యానివలెనెయుండు మౌనివలెనెయుండు
భోగివలెనెయుండు రోగివలెను
సకలము దెలిసిన సర్వజ్ఞుడైయుండు
పరగ యోగిపరుడు పరగ వేమ॥

సర్వము నెరిగినవాడు పరులకనులకు సంసారివలెను వ్యాధిపీడితునివలెను, మూసివలెను, ధ్యానివలెను, తిక్కవాని వలెను గనపడుచుండును. మరియు

గీ॥ కడగి సంకల్పములనెల్ల కట్టిపెట్టి
చిత్తమున నేమిదెల్పక చిత్రరూపు
కైవడినియున్న యాతడు ఘనుడు దలుప
నడవియందైన పట్టణమందు వేమా॥

కోరికలు లేక చిత్తస్వాధీనత గల్గినవాడు అడవియందైనను గ్రామముల యందైనను యుండగలడు. మరియు ఆగామి సంచిత ప్రారబ్ధకర్మముల దహింపజేయునట్టి తత్వజ్ఞానంబునకు సమానంబేమార్గంబు లేదని సర్వమత గ్రంథములు నొక్కి వక్కాణింపుచున్నవి. (త-త్వ-జ్ఞానం) తద్ అనగా అది లేక జీవుడు. త్వ యనగా ఇది లేక శరీరము. జ్ఞానంబనగా యదార్థము. తత్వజ్ఞానంబనగా జీవదేహముల నిజమును గుర్తెరుగుట (యదార్థమునగా జూచుట యని అర్థము.) మరియొక అర్థము. దేహి దేహముల సంధిని జూచుట. దీనిని గురించి జీవహింసగూడదను ధర్మమును ఏర్పరచిరి. జీవహింసయనగా మాంసము తినగూడదని అర్థముకాదు, కాని జీవుని ఉత్పత్తి, స్థితి,లయముల గుర్తెరుగక, జీవపరైక్య భావంబెరుంగక పోవుట జీవహింస యనబడును. ఒకజంతువును చంపినఎడల అది కొంత మేలుగాయుండును కాని తనజీవునియొక్క ఉత్పత్తి,స్థితి, లయ మెరుగకపోవుటవలన స్వజీవహంతకుడగుటేగాక కోట్లకు మించిన జీవులను చంపినవాడగుచున్నాడు. ఏలన, జీవుడు

పుట్టుచావుల బొందియుండుటవలన అనేకదేహములయందు ప్రవేశించి అనేక పాపములు జేయుచు అనేకశరీరముల దుంప దెంపుట జీవహింస యనబడును. మాంసాదులు తిననివారు జీవహింస చేయుటలేదని భావించ వలదు. ఎంతవరకు జీవుని యదార్థస్థితిని ఎరుగక యుందురో నంతవరకు జీవహింస చేయువారగుచున్నారు. మాంసముతినుట వదలినమాత్రమున జీవహింస చేయనివారు కారు. జీవ పరైక్యమును దెలిసి మాంసము తిననమాత్రమున జీవహింస జేయువారుగారు. గనుక అహింస ధర్మమెరిగినవారు దప్పక జీవపరైక్యమును దెలియవలెను. దెలియనిచో జీవహింస చేయువారగు చున్నారు. కొందరు జీవహింసయనగా మాంసము తినగూడ దని బోధజేయుదురు. మాంసము తినగూడదనుమాట వాస్తవము కాని జీవహింసయను పదమందాయర్థము ప్రతి పాదించదు. సర్వభూతదయ ననుసరించి యింద్రియ నిగ్ర హంబును గురించియు మాంసము తినగూడదని చెప్పవచ్చును. ఇదియునుగాక కొందరు జ్ఞానముననగా భక్తియేనని నొకచో, వ్రాయుచు, మరియొకచోట భక్తిలేనిచో జ్ఞానములభించదని వ్రాయుచు, యింకొకచోట జ్ఞానములేనిది భక్తి, మూఢ భక్తి యనబడుననుచు నొకగ్రంథములోనే మార్పులుగా వ్రాయుచుందురు. ఇట్లు మార్పులుగా వ్రాయువారి తెలివి యును మార్పుగానుండునని తెలియుచున్నది. ఒకమార్గము బట్టి వెళ్ళువారికి, రెండవమార్గము ఏగ్రామమునకు బోతే తన కెందుకు, అందుసంకల్పించి విచారించుట సందేహమగును,

సందేహము పునర్జన్మకు కూకుటేరు వంటిది. వెనుక దిరుగు టేల, ప్రక్కచూపేల తనముక్కు సాయజూచుకొని తానుగురి బెట్టుకొనినచోటుకు వెళ్ళగూడదా. అడ్డముబడి రాళ్ళు ముండ్లు యనక తానుతలచిన తావుకు వెళ్ళగూడదా.

శ్లో॥ కృతెతపశ్చరేణేవ। త్రేతాయాం యజ్ఞమేవచ
అర్చనం ద్వాపరేప్రోక్తం। కలౌ సంకీర్తకేశవమ్॥

కృతయుగమున తపస్సుచేతనున్ను, త్రేతాయుగమున యజ్ఞములచేతనున్ను, ద్వాపరయుగమున పూజధ్యానము చేతనున్ను, కలియుగమున హరినామ సంకీర్తనలచేతనున్ను ప్రజలకు మోక్షములభించుననియున్నది. ఇది నిశ్చయంబై యుండును. "ఏలన ముందుయుగములయందు జనసంఖ్యతక్కువగానున్ను, అందు విద్యావిహీనులు చాలాభాగముగా నుండి యుండవచ్చును. అందునిమిత్తము ఒకస్మరణమాత్రమున వారికి నూత్న జ్ఞానము కలిగియుండి యుండదు. కాబట్టియే, తపోధారణ యోగంబులు అవశ్యకమైయుండెను." ఇప్పుడన్ననో జనసంఖ్య ఎక్కువనున్ను, చాలాభాగము విద్యాబుద్ధి విచార సూక్ష్మజ్ఞానముగలవారుండుటవలన "రామ, కృష్ణ, గోవింద, నారాయణ" యని పాటలు పాడిన మాత్రమున సర్వకర్మములు నశించి పరమ పదమును జెందుచున్నారు. కాబట్టివేమ నార్యులు

గీ॥ జీవగుణ మెఱుగక జీవుండు తానుగా।
యోగియగునె యోగధాటిలేక।
వదరుచుండగానె వచ్చునా మోక్షంబు
విశ్వదాభిరామ వినురవేమా॥

యని జెప్పిరి. ఇదియునుగాక శ్లో॥ అగ్నిర్దేవో ద్విజాతీనాం। మునినాంహృది దైవితమ్ । ప్రతిమా స్వల్పబుద్ధీనాం। సర్వత్ర సమదర్శనాం॥ ఈ విధంబున సర్వవ్యాపకమైన పరబ్రహ్మభావంబు విడిపించి విగ్రహారాధన మొదలుగలగురుదేవతార్చనలందు ప్రజలకు స్వల్పబుద్ధికలుగజేయుటకు ఇప్పటికిన్ని మతాభిమానముగల, వాచా బ్రహ్మజ్ఞానగురువులు. వీటికిన్ని జ్ఞానమునకున్ను భేదము లేదనుచున్నారు. ఇందులకే వేమనార్యులు

గీ॥ వెన్న చేతబట్టి వివరంబుదెలియక
ఘృతముగోరునట్టి నియతభంగి
తాను దైవమయ్యు దైవంబు వెదకును
విశ్వదాభిరామ వినురవేమా॥

వెన్న చేతిలో బట్టుకొని కరిగించు జ్ఞానములేక నెయ్యి కావలెనను మానవునికి, నీచేతిలోయున్న వెన్న కరిగిన నెయ్యి యగునని చెప్పక, తెలిసి తెలియని ద్వేషగురువులు దాహము గొనిన వానికి యండమావులు జూపునట్లు సులభమైన మార్గమును పోవిడిచి వృథాకాలహరణము జేయునట్టి మార్గంబు జూపి యొక జన్మతో కడతేరలేరు. మరియొకప్పుడు ఉత్తమ జన్మమెత్తి కడతేరుదురని శిష్యులకుబోధించుచున్నారు. ఇట్టిబోధ

లకు లోబడు శాస్త్రదృష్టముదెలియని అవివేక శిష్యులు పుట్టు గిట్టుల బొంది బాధలొందుచున్నారు. అయ్యలారా! "కలౌ సంకీర్త కేశవం" బనిన వచనమును వితర్కించిజూచిన యెడల ఈ క్రింద వ్రాయబడు విధమున అర్థమగుచున్నది.

ఈ కలియుగమున మనుష్యులు అల్పాయుష్మంతు లగుట వలననున్ను, నరులకు దేహపటుత్వములు తరుగై యుండుట వలననున్ను, తపోధారణ యోగంబులు చేయలే రనిన్ని, ఒకవేళ చేయదలచిననునుతినిలకడయుండదనిన్ని "కలౌ సంకీర్త కేశవమ్"బని చెప్పియుండవచ్చును. మరియు కలియుగ నరులు పాపభీతిలేక దుష్ప్రవర్తనలందాసక్తిగలవారై సుఖ జీవులై యుందురని కష్టపడుమార్గంబులు జూపిన పట్టుపడవని, మితాహార, మితభాష, మితనిద్ర మొదలుగల అభ్యాస యోగంబులుజేసి జన్మరాహిత్యమును జెందుడని, ఎన్నివిధం బుల జెప్పిన వినరని గొంతులవరకుతిని పొట్టలుబెంచుకొని రేయుపగలు నిద్రబోవుచు ప్రపంచసుఖము లేశమైనను విడువని ప్రజలను "ఓనాయనలారా, మీరుపుణ్యముజేసి పెట్టిపుట్టినవా రు కావున జీవుని కష్టబెట్టక, జీవుడు కోరునట్టి రుచిపదార్థములు తృప్తిదీర బెట్టుచు, మద్దెల, ఫిడిల్, త్రోకుడుహార్మని యమ్, గజ్జలుగట్టిన పలకతాళములు మొదలుగల వాయిద్య ములతో, మంచి చమత్కార రాగసరళితో "రామ, కృష్ణ, గోవింద, నారాయణా" యని హరినామసంకీర్తనలు పాడి భజ నలు జేసిన మోక్షమని, సుఖమొదలని కలియుగనరుల ముఖ్యాభిప్రాయంబుల నెరింగిన మహనీయ ఋషిసత్తములు

“కలౌ సంకీర్త కేశవమ్”బని బలికియుండ వచ్చును. గాని భజన జేసిన మాత్రమున మోక్షప్రదాయులు గాలేరు. కలి యుగమున భజనజేసినవారికే మోక్షము లభించినయెడల, తపో ధారణ యోగంబులు నభ్యసించువారికి, ఏమోక్షమొచ్చునో ఆలోచించుడి, లేక, యీకలియుగమున యోగాభ్యాసంబులు జేయువారు బుద్ధిహీనులా? లేక యీబ్రహ్మచార్య, వానప్రస్థ వ్రతములు సల్పువారు ఏమోక్షము గావలెనని గోరు చున్నారు. ఎన్నివిధంబుల యోచించినను భజన శ్రేష్ఠము కానేరదు. బుద్ధిగల మానవులు తమలోతాము విచారించి అస్థిరమైన మానవశరీరము నీటిబుగ్గ సమమని త్వరపడి జ్ఞాన మార్గంబునప్రవేశించి జీవహింసధర్మంబైన జీవుని ఉత్పత్తి, స్థితి, లయాంతములు గుర్తించి, కష్టించి, జీవుడుతిర్గిరానట్టి మార్గంబు నభ్యసించుట ఉత్తమము. ఇదిసత్యము, సత్యము, సత్యము.

# అవతార పురుషులు

## (దేవునిచే పంపబడిన దూతలు)

వారి వారి అంత్యకాలమందు ఏ విధ దశలు

అనుభవించినది. విమర్శ

శ్రీరామ లక్ష్మణులు సీతాసమేతులై మహాబలపరా క్రమ భక్తినిష్ఠులై యుండుట లోకమునందెల్లరలు యెరు గుదురుగదా! చివరలో సీతాదేవి హత్య జేసుకొనెననియు, శ్రీరాముడు భార్య వియోగముచే దుఃఖితుడై సర్యూనదియందు

బడి ప్రాణత్యాగము చేసుకొనగా తమ్ముడు, మరి కొందరు దుఃఖితులై సర్పానవిల్లోబడి చనిపోయిరనియు వ్రాయబడెను. వీరి జీవితములో యేలాటిప్రజ్ఞలుగలిగియుండినను చివరిలో యీలాటి మృత్యుదశ అనుభవించుటవలన ఘనతను గోలుపోవడమాయెను.

శ్రీకృష్ణుడు బాల్యమునుండియు చూపిన లీలలు అనగా మహిమలు అద్భుతములైయున్నవి. కాని చివరలో తనచావు తానుగుర్తించలేక (చావును తప్పించుకొనలేక) బోయవానిచేతి నొక్క బాణమున పేటుబడి దుఃఖించి చచ్చెనట. మొదటున్న లీలలు యిప్పుడేమాయెను. ఈదేవుడు చచ్చిన తరువాత తనభార్యలైన రుక్మిణి, రాధా మొదలగు వారు బోయవాండ్ల చెంచువాండ్లచే జిక్కబడినారని చారిత్రకారులు వ్రాసి యున్నారు. శ్రీకృష్ణుడు తనజీవితములో యేలాటి మహిమలు జూపినను చివరిలో యీలాటి మృత్యుదశ అనుభవించుటవలన తనఘనతను గోలుపోయిన వాడాయెను. బలరాముడు చివరిలో త్రాగుబోతై పాముకాటుచే చచ్చెను. ఏసుక్రీస్తులవారు తనజీవితమందు అనేకమహిమలు జూపియు చివరిలో సామాన్య మనుష్యుల చేతిలోజిక్కి మహిమలు జూపలేక కొరడాలతో కొట్టబడి శిలువవేయబడెను. వీరిజీవితములో ఏలాటిమహిమలు గలిగుండినను చివరిలో యీలాటిమృత్యుదశ అనుభవించుట వలన గొప్పతనమునకు అడ్డుగలిగెను.

హజరత్ మహాత్ముడులవారు అవసానకాలమున ఒక నెల దినములు జబ్బుబడి చనిపోయెననియు వ్రాయబడెను. ఇంకా అనేక మహానుభావులు తపశ్వియులు పడరాని బాధలు బడి హీనమైన కష్టదశ అనుభవించినట్లు చారిత్రకారులచే వ్రాయబడి యున్నవి. బద్వేల్ ఖాదర్ మస్తాన్ గారు చనిపోయిన పిమ్మట కొందరికి కనబడి, తనశరీరము సామాధినుండి తీయమనియు, కొందరికి ఆవేశరూపమున, కొందరికి స్వప్నావస్థద్వారా తనుశరీరము సామాధినుండి వడ్డుకుతీయమని తీయించుకొని, చనిపోయిన పిమ్మట పదునొకండు నెలలు మంచముపైనుండి, చివరిలో గవర్నమెంటువారు స్వాధీనము జేసికొనినప్పుడు యేమహిమలుజూపక సామాన్యమానవునింబోలె భావించుటకు కారణంబాయెను. గనుక యేలాటివారైనను నా రహస్యదేవుని ఆజ్ఞానుసారము నటించవలెననియు, నారహస్యదేవుడు తనస్వతఃసిద్ధక్రియ నిత్యంబని ప్రజలకు కనుబరచుటకై, అనేక మహాన్యులను బుట్టించి మహిమలు జూపునట్లు శక్తిసామర్థ్యము కలుగజేసి, చివరిలో వారిశక్తి సామర్థ్యతను వ్యర్థముచేసి, తానే అన్నిటికిని కారణుండైనట్లు నిరూపించి, యీలాటిమహాన్యులకన్న మహాన్యుడనని ప్రజలను తెలియజేయుటకు సత్పురుషులను చివరిలో హీనదశ పొందింపజేసెనని దృఢముగా నమ్ముదును.

# తలంపులేని దేతపస్సు

హిందూమతము సముద్రము. ఇతరమతములు చిన్న
చిన్న చెరువులు. హిందూమతమందు గొప్పగొప్ప రహస్య
ములు గలవు. మన గురుస్వాములు రహస్యములు చెప్పక
ఐహిక సుఖము కీర్తికొరకై తమతమ వుపయోగపద్ధతులను
బోధపరచి చెరచిరి. ఇప్పుడు మేలుకొనుడు. యీదేసమ
యము. వేదరహస్యములు వుచితముగా బోధపడును. వేరే
మతగురువుల వద్దకు వెళ్ళనవసరము లేదు. ఆదిశేషుడు భూమిని
మోయుఅర్థము, భూమియనగా శరీరమును శ్వాసయనెడు
సర్పము మోయుచున్నది. శ్వాసే సర్వ చదువులు. శ్వాసే
సర్వప్రజ్ఞ గలుగజేయుచున్నది. శ్వాసే యీసృష్టి. శ్వాస
లేనిచో సర్వసృష్టి నాశనమొందు చున్నది. ఈశ్వాసకు జాతి
కులభేదంబులు లేవు. "మమాత్మ సర్వభూతాత్మ" యనునది
యెక్కువ తక్కువలను జాతికులములను ఒకటి జేయుచున్నది.
శ్వాసకుమించినది జగత్తునందు మరియొకటి లేదని ప్రతిమాన
వుడు గ్రహించవచ్చును. ఇట్టి రహస్యములు హిందూమత
మందుగలవు. శ్వాసయొక్క రహస్యములు తెలుసుకొని
పూర్వమూఢవిశ్వాసంబులు వదలుడు. శ్వాసచేతనే మర
ణము వచ్చుటయు, మూర్ఛవచ్చుటయు, మైకము గప్పుటయు,
నిద్రవచ్చుటయు గలుచున్నది. శ్వాసయొక్క రహస్యమెరిగి
తిర్గి జన్మరానట్టి పదవిని పొందుము. జీవబ్రహ్మైక్యంబగుటకు
హిందువులు రామ, శివ, కృష్ణ, హరి, సోహంబనియు,
మహమ్మదీయులు, యాహు, యామస్వా, యనియు ఏవమతస్తులు

ఆయా నాదములు శ్వాసయందు లయపరచేవిధమెరిగిలయపరిచి నచో బ్రహ్మానందము నొందుదురు. దీనినె బ్రహ్మనిష్ఠయనియు అజపగాయత్రి మహామంత్రంబని యందురు.

ఇది నియమ, నిష్ట గానిది. మహాసూక్ష్మమైనది. సర్వ మత సమ్మతమైనది. ఇదియే తారకము, అమనస్కము, అచ లము వేరేలేదు. రాతిబొమ్మలను, చెట్లను, పశువులను పూజించుట మానుకొని తమలోతాము ధ్యానము జేయుచు సత్యం, ధర్మం, దయ, శాంతంబనెడు మోక్షద్వారములు తెరచి హాయిస్థానము జెందుడి. మనస్సు, వాయువు, దృష్టి నొకటిజేయు సూక్ష్మమైన గురుకీలక మెరుగక గ్రంథములచే గ్రహించవలెనని భ్రమసెదరు. యీమార్గము సద్గురువు దాపుసజేరి జూచి గ్రహించవలెను. అంతవరకు తెలియలేరు. ఇట్టి మార్గదర్శి యగుటకు కేవలము వైరాగ్యమవస్యకము. ఈ కీలెరిగినవారికి యీషణత్రయములు విడిచిపోవును. అరిషడ్వర్గ ములు హరించిపోవును. అష్టమదములు నష్టమైపోవును. అభిమానము లణగిపోవును. నీదినాదను భేదము ఛేదింప బడును. భ్రాంతిభయములు బాసిపోవును. విషయభోగములు విషమై తోచును. ఇన్ని విడిచిపోవుటవలననే యీమార్గము కష్టమైన మార్గంబనంబడి బ్రహ్మవిద్యయను పేరుబొందినది. కానియీమార్గముమహాసూక్ష్మమైనమార్గము. ఇంతకుమిక్కిలి సూక్ష్మమార్గము యెక్కడను లేదు. ఎందుకనగా యీకీలె రిగినవారికి యెండ, గాలి, వాన భయము లేకుండును. శరీర మునకు గల్గు కష్టములు సుఖములుగా గనబడు చుండును.

అభిమానములు మొదలుగల కించిత్ జ్ఞత్వాది గుణములు లేక పోవును. గనుక యిది సులభమార్గము యనబడును.

# రహస్యముల విమర్శ

1. ఆదిశేషుడు భూమినిమోయుట—భూమియనగా యీ దేహము. శేషుడనగా శ్వాస, శేషము అనగా మిగిలినదని అర్థము. శ్వాసను సర్పముగా భావించినారు. పుట్టలోని పాము ఒకటి బుసలు పెట్టుచున్నదని పెద్దవారు వ్రాసిన పాటగలదు. (చందమామ, చందమామ, చందమామ పాముకుబట్టె జోగియెవరెచందమామ) యని యీలాటి చాలాపాటలు వేదాంతులనోట వినుచుందుము.
2. శ్రీకృష్ణుడు కాళింగమడుగునందు యేడుపడిగెలపామును నాతమణచుట-హృదయమె కాళింగమడుగు, శ్వాస పాము. ఏడుపడిగె లెవ్వియన రెండుచెవులు రెండుకండ్లు రెండు ముక్కులు నోరు వెరసి ఏడుపడిగెలు. త్రొక్కుట= శ్వాసను స్వాధీనపరుచుకొనుట. కృష్ణుడు = జ్ఞానము. జ్ఞానమనెడు కృష్ణుడు ఏడుపడిగెల పామనెడు శ్వాసను స్వాధీన పరచుకొనుటయే త్రొక్కుట.
3. లింగమును చుట్టియుండెడు ఏడుపడిగెలపాము—శ్వాసయనెడుపాము యేడుపడిగెలనెడు నేత్రములు, ముక్కు, చెవులు, నోటితో లింగమను శిరస్సును రక్షించుచున్నది.
4. శ్రీకృష్ణమూర్తి పాముపై పండుకొనుట — ఇదియు సర్పముయొక్క సూచనయే. శ్వాసే శేషుడు లేక సర్పము.

శ్వాస శరీరమంతట వ్యాపించి యుండుటవలన శేషపాన్పు యని పేరు కలిగెను. పాముపై మనుజుడు పండుకొనుట కాదు కాని మనస్సు శ్వాసయందు మగ్నము చేయుటె పండుకొనుటయని యెరుంగుడు.

5. ఈశ్వరుడు పామును మెడకుజుట్టుకొనుట—కంఠస్థానమే జీవస్థానమని తెలియని పామరులకు బోధించుటెగాక విషపురుగును మెడకుజుట్టుకొనుట గొప్ప మహిమయని మహాత్ముడు గారడివిద్య జూపలేదని యెరుంగుడు,

6. నందివాహనము— నందము, నంది = ఆనందము, శివుడు బ్రహ్మానందమునొంది నిత్యానందుడాయెను. కూర్చుండుటకు యేమిదొరకక మొద్దుదైన యెద్దుపై గూర్చున్నాడని తలచవలదు. పామరులకు బోధించుటకు ఇదియొక సౌజ్ఞ యని గ్రహించుడు.

7. హంసవాహనం:- హంసయనగా పక్షిగాదు. శ్వాశేహంస, శ్వాసను స్వాధీనము జేసికొనుటె వాహనంబని తెలియుడు. ఇది బ్రహ్మవేత్తల సూచనయని యెరుంగుడు.

8. జంధ్యము వేయుట:- ఈ సూచనయు శ్వాసదె. శ్వాశేమన యందు జంధ్యమువలె షడ్చక్రములందున్నదనిచూపించిరి. ఇదియే జపమాల. పూసలతో కూర్చబడినది జపమాల కాదు.

9. **మూడడుగుల దానమిచ్చుట:-** వామనుడు యనగా జ్ఞానము. బలిచక్రవర్తి యనగా అజ్ఞానము. జ్ఞానోద్భవముచే మూడడుగులు యనగా అనుట, వినుట, కనుట వదలిపోయెను. బలిచక్రవర్తి గర్వాంధుడై యుండగా దేవుడు వామనుడను గురువురూపుడై జ్ఞానముప్రసాదించి, గురుదక్షిణమూడడుగుల దానము కోరెను. అనగా ఎరుక యనెడు ముప్పూరివాక్యములు బోధించగా బలిచక్రవర్తి ముప్పూరి వాక్యములను గ్రహించి ఎరుకను విడనాడుట. ఇదియే మూడడుగులదానమిచ్చుట. ఎరుకను విడచుటనగా శరీర భ్రాంతివదులుట.

10. మూడునామములు బెట్టుట:- ఈడ, సింగళ, సుషుమ్నా నాడులను, నొష్టబెట్టు నామములనెడు గీతలచె తెలియజేయుట.

11. పంచసంస్కారములు:- భుజములు కాల్చుటకాదు. పంచభూతగుణములు పంచభూతములందైక్యపరచుట. ఇదియే కాల్చుట.

12. జీవసమాధి:- తనమనస్సు శ్వాసయందులయము జేయుట ఇదియే జీవసమాధి.

13. జీవహింస:- మనస్సుచే శ్వాసను సంధించుట. తెలియక అజ్ఞానవృత్తులలో బడియుండుటె జీవహింస యని యెరుంగుడు.

14. క్షీరసముద్రము జిలికి అమృతము గొనుట:- ఇంద్రియమె క్షీరసముద్రము. శిరస్సు మేరుపర్వతము. సర్పమే శ్వాస. జిలుకుట=శ్వాసనుదప్పుట. అమృతమె ఆనందము. ఇట్టి బ్రహ్మానందము నొందిన వారే దేవతలు (జనన మరణము లేనివారు.)

15. సప్తాహమనగా:- సప్తగ్రహములకు పేర్లు. అనగాసూర్యుడు మొదలైనవారు (అనగా) ఏడు వారములకు పేర్లు. అనగా హంసస్థానమే ఆదివారము. ఇట్లు ప్రతియొక్క వారమునకు అర్థమున్నది. ఈ ఏడువారములు మనలోయుండు యేడుజ్యోతులకు పేర్లు. ఈయేడుజ్యోతులు యేవియనిన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములలో కొన్నిటినిజేర్చి ఏడువారములుగా యేర్పరచిరి. యేడుదినములలో ముక్తి కేగుట యనియు, సప్తాహంబని యేడుదినములు భజన చేయుటయనియు, మనలోయుండు ఏడుజ్యోతులను స్వాధీనపరచుకొనుటయేగాక భజనచేసిన మోక్షమువచ్చుననువట్టిభ్రాంతియే.

16. యజ్ఞమనగా:- హృదయమనెడు వేదియందు తపస్సనెడు అగ్నిలో కోపమనెడు పశువులను, కామమనెడునెయ్యిని, సమిధమనెడు శరీరమును బడవేసి వాక్కుయనెడు హోత చేత పలుకులను ఆహుతి జేయుట యజ్ఞము.

17. అర్జునుడు సైంధవుని జంపుటకు పాశుపతాస్త్రము ఉపయోగించెనట. శ్వాసే పాశుపతాస్త్రము. వేరులేదు.

18. శిఖాపవనమనగా శరీరమునకు అంత్యమైనది మనస్సు కావున మనస్సును త్యజించమని అర్థము కాని కేశము లను కత్తిరించుటకాదు.

19. గరుడవాహన మనగా పక్షి. శ్వాసేపక్షి. ఈశ్వాసను కలిగియున్న-విష్ణుమూర్తిసూచన- (జ్ఞానమునహిః) జ్ఞానము లేనిదిదేనికనిభగవద్గీతలోగలదు. పక్షులపైపురుగులపై పశువులపై కూర్చుండుట గొప్పమహిమయని మహానుభావులు కూర్చోలేదు. కాని ఇవన్నియు జ్ఞానముబోధించునట్టి సూచనలని దలచుడు.

20. ఆంజనేయుడు సూర్యుని దిగమ్రింగెనని వింటిని. సూర్యుడు యెంతపెద్దది. భూమి యెంతపెద్దది. ఆంజనేయుడు యెంతపెద్దవాడు. ఎట్లు మ్రింగెను. మ్రింగునది నిజమా ?

21. అగస్త్యులవారు ఉప్పుసముద్రము మ్రింగెననిరి. సముద్రము అరచేతిలో యిముడుటెట్లు? దీనిఅర్థమును గ్రహించుడు.

22. గజేంద్రమోక్షమందు మొసలి ఏనుగును పట్టుకొనినప్పుడు యీరెంటి పోరాటము వెయ్యిసంవత్సరములు జరిగెననిరి. వెయ్యిసంవత్సరములు వీటికి అన్నఆహారము లెట్లు జరిగెను. అన్న ఆహారములు వెయ్యి సంవత్సరములు లేకున్న అవి జీవించుటెట్లు? విష్ణుచక్రము వచ్చుటయు, యేనుగు మనిషియగుటయు కథకలదు. వీటినన్నిటిని యెట్లు తెలుసుకో గలరు. కథకల్పించిరందురా లేక నిజ

ముగా జరిగె నందురా? నిజముగా జరిగెననియె వాడుక. ఇది యంతయు ఆత్మయందుకలదు. ఇవి వేదాంత రహస్యములని యెరుంగుడు.

హిందూమతమందలి గూఢార్థములు గ్రహించజాలక ఆచరించునట్టి పనులు చాలాగలవు. మరియు ఒకరాశి చెప్పబడిన పదిపనులుంటె అందులోనొకటి చేయుటయు, రెండవది చేయకపోవుటయు గలదు. ఉదాహరణ:- శ్లో॥ స్వాను కుక్కుట మార్జాలం మద్యభాండ రజస్వలః। స్పృష్ట్వాదేవలోకంచైవ సచేల స్నానమాచరేత్॥ అయ్యలారా యీశ్లోకమందు చెప్పబడిన ప్రకారం నడుచుకోమన్నారు. (హిందూశాస్త్రమందు) ఇందులోనిది ఒకటి విడిచి యొకటి ఆచరించమనిలేదు. అన్ని సమానములే. ఇందు ఒకటి యెక్కువ ఒకటి తక్కువలేదు. అయితె హిందువులు కొన్ని చేయుచు కొన్ని చేయకున్నారు. స్వాను=కుక్క, కుక్కుటం=కోడి, మార్జాలం=పిల్లి, మద్యభాండం = కల్లుముంత, రజస్వలః=సమరైన స్త్రీ, అర్చకుని వీటిని ముట్టికొనినవారు బట్టలుతడిపివేసి స్నానము చేయమనిరి. అయితె మనవారు సమరైన స్త్రీని ముట్టుకొనక దూరమున యుంచుచు, కోడిని, కల్లుసారాయిని దిగమ్రింగుచునే యున్నారు. ఏమి మీరు తెలియనివారా! సమరైన స్త్రీని జూచినట్లె మిగతావస్తువులను జూడరాదా! లేక మిగతా వస్తువులను తిని త్రాగినట్లే సమరైన స్త్రీని కలుపుకోగూడదా! ఒకటటు ఒకటిటు చేయుటకు కారణమేమి? మగవారికి తెలియకున్న ఆడవారికి తెలియదా, ఆడవారికి తెలియకున్న మగ

వారికి తెలియదా ? హిందూమతమందుయీలాటి పనులు అనే కములున్నవి. ఇట్లుండుటవలన హిందూమతము అజ్ఞానమనిరి. మతకులములనెడు యీఅజ్ఞానవృత్తులు మానుకొనుటయే జ్ఞానము. బ్రహ్మజ్ఞానముకన్న మించినది మరియొకటి లేదు లేదు లేదు.

# షట్చక్రముల వివరం

ఆదివారము మొదలుకొని గురువారమువరకు చక్రములనిన్ని, శుక్రవారమునకు బ్రహ్మనివాసస్థానమైన సహస్రారమనిన్ని, చెప్పంబడును. ఆధారం స్వాధిష్టంమొదలు ఆజ్ఞేయమువరకు ఆరుచక్రములనిన్ని, సహస్రారమునకు బ్రహ్మనివాసస్థానమనిన్ని చెప్పంబడియున్నది. ఈఆరుచక్రములు బ్రహ్మదండీయను వెన్నెముక సంబంధమై లోపలయున్నవని చెప్పుచున్నారు. కాని వీటిని నిశ్చయముగా విచారించినచో డాక్టర్లు శరీరమును కోసిచూచినయెడల కనబడలేదు. కనబడనప్పుడు లేవని భావింపవచ్చును. లేవాయని దలచినయెడల దేవాదిఋషుల అభిప్రాయములు భిన్నమగుచున్నవి. ఋషులు శిద్ధిపురుషులు గాన దివ్యదృష్టిలో యీ చక్రములు కనబడియుండవచ్చును. ఇట్లు నిశ్చయించుటకు మరియొక విధమున దలచ వచ్చును. యీషట్చక్రములు ప్రాణవాయువుచేత రక్తము, సన్ననినరములు, మాంసపుపొరలు, ఆయా చక్రరూపము దాల్చి కోసినప్పుడు ప్రాణవాయువు లేచిపోవుటవలన ఈరక్తమాంస నరములు ఏర్పడినవిధము విడిచి మొత్తబడి

రూపహీనము బొందియుండుటవలన కోసినప్పుడు కనబడలేదని దలచవచ్చును. ఇట్లు దలచినను ఈకాలమునందు డాక్టర్లు కొన్నికొన్ని సూక్ష్మమైన యంత్రములచే ప్రాణవాయువు యున్నకాలమందే శరీరములోపల యుండెడు రక్తమును, నరములను, మాంసపు పొరలును కనుగొనుచున్నారు. కాబట్టి అట్టి యంత్రములచేత నైనను పరీక్షించియుండి యుండకూడదా. అట్లు పరీక్షించినచో షట్చక్రములు యున్నవని వెల్లడిచేసి యుండరా యని తోచుచున్నది. ఎవరిభావన యెట్లున్నను షట్చక్రములను గురించి నాదృష్టికి యిట్లు తోచుచున్నది. శరీరములోపల యుండెడు చక్రములు గుర్తుకొరకేగాక లోపలచక్రములు లేవనిన్ని, ఆదివారము మొదలు గురువారము వరకుగల దినములకు పేర్లుగనుక షట్చక్రములన్నను కాలచక్రములన్ననుఒకటేననిన్ని, ఆదివారము సోమవారములన్న ఒకవారమునకు మరియొకవారమునకు భేదమేమియులేక నామము మాత్రమే భేదముగనుపడుచున్నదికాబట్టి ఆది సోమ యనెడు నామములు గుర్తుకొరకే పెట్టుకొనినపేర్లు కాని ఈనామములు నామమునకు తగినరూపు, క్రియ ఈశరీరమందు యున్నవనిన్ని వీటిని షట్చక్రములన్నను, కాలము తెలుపునట్టి కాలచక్రములన్నను, చెల్లుననిన్ని తెలియుచున్నది. దేశమనినదేహమనిన రెండొకటియె కాబట్టి దేహమునుండి దేశమైనది. కాబట్టి దేహమునందు గలవన్నియు దేశమునగలవు. కాబట్టి దేహమునగల షట్చక్రములు కాలచక్రములు ఈక్రింద వివరించు చున్నాను.

ఆదివారము సోమవారము మొదలు ఆరువారములు గుదము, శిశనము, చెవులు, కండ్లు, ముక్కు, నోరు, ఇవియే కాలచక్రములు.

ఆదివారము = శిశనము, సోమవారము = చెవులు, మంగళవారము=కండ్లు, బుధవారము=ముక్కు, గురువారము= నోరు, శుక్రవారము=కంఠము, శనివారము=గుదము,

ఆదివారమనగా :- మొదటిది. అనగా యితరములను కల్పించునది. తనవలననే ఇతరవారము లగుచున్నవని అర్థము. కాబట్టి ఆదివారమునకు శిశనమని పేరు పెట్టితిని. శిశనమువలన శరీరములు యేర్పడుచున్నవి కాబట్టి శిశనము సృష్టించునట్టి దని తెలియుచున్నది. ఇదియే ఆదియనగా మొదటిదని దలచితిని.

సోమవారమనగా :- చల్లదనము నిచ్చునట్టిది. సోమ యనగా చంద్రుడని యర్థము యగుటవలన చల్లదన మిచ్చు నట్టిదంటిని. శరీరమునకు చల్లదనము నిచ్చునట్టివి చెవులు యని తోచుచున్నది. శీతాకాలమందు చెవులకు గుడ్డలు కట్టు చుందురు. ఎందుకనగా చెవులు అన్ని అవయవములవలె చలిని పట్టజాలవనిన్ని ముందె చల్లనివి గనుక చలి చెవులయందు దూరుటవలన మనిషిని వణుకు బుటించునని దలంచి సోమవార మనగా చెవులని చెప్పితిని.

మంగళవారమనగా :- కళతో గూడినవనిన్ని, ఆనంద మును కలిగించునవనిన్ని, కళయనగా వేడినిచ్చును గనుక చక్షువులకు సూర్యుడు అతిదేవతయని పెద్దలువచించియున్నారు.

మఱియు మంగళమనగా శుభమని అర్థము కాబట్టి కండ్లు శరీరమును శుద్ధిగలిగించి శరీర శుభమును కోరుచున్నవి కాబట్టి మంగళవారమనగా కండ్లుయని పేరిడితిని.

బుధవారమనగా:- బుద్ధితో గూడినదనిన్ని, బుద్ధియే దేహమునకు కర్తయనిన్ని బుధులనిన బుద్ధిగలవారనిన్ని, బుద్ధి ముఖమందు యున్నదని పెద్దలు వచించుటవలన బృహస్పతి కుమారుడు బుధుడని చెప్పుటవలననున్ను, బుధుడు శుక్లాచార్యులవద్దచచ్చినవారిని బ్రతికించువిద్య మృతసంజీవిని తెలుసుకొనుట వలన శుక్లాచార్యులన్న శుక్లమునకు సంబంధించినదని శుక్లము బుద్ధితో సంబంధించియున్నదనిన్ని, శుక్లము శిశ్న సంబంధము గనుక శిశ్నము ఆదివారమునకు చెప్పితిని గనుక బుధవారము ఆదివార సంబంధమై యున్నది కాబట్టి బుధవారమనగా ముక్కుయని పేరిడితిని. ముక్కునకు శిశ్నమునకు యీరెంటికి సంబంధమైనది బుద్ధిగనుక బుధుడు శుక్లాచార్యుల శిష్యుడు గనుక బుధవారము ముక్కుయని పేరుపెట్టితిని.

గురువారమనగా:- గురువనగా బోధించువాడు. తెలియని వాటిని తెలియబరచువాడు. గురువే బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడని చెప్పుటవలన గురుబ్రహ్మమన్నను, శబ్దబ్రహ్మమన్నను రెండొకటియే కావున శబ్దము నోటియందు యుండుట వలన శబ్దమే ఈ జగత్తును పరిపాలించుచుండుట వలన, శబ్దమే బ్రహ్మమనుటవలన బ్రహ్మమనగా గురువు యనుట వలన గురువారమనగా నోరుయని చెప్పితిని. వేమయ్యగారి

వేదాంత సిద్ధాంతమందు నోటిని బ్రహ్మమని, బ్రహ్మను చంపినచో బ్రహ్మజ్ఞుడౌనని అనగా నోటియందు శబ్దమున్నది కాబట్టి నోరుమూయుటవలన శబ్దరహితమౌనని, శబ్దరహితమగుటే బ్రహ్మను చంపుటయని బ్రహ్మదేవుని ముండ బండి రేవున మోయుయని ప్రపంచమందు శబ్దములేకున్న ప్రపంచము శూన్యమౌనని, ఇట్టి శబ్దమనెడు బ్రహ్మమును ముండ మోయింపజేయుడని, బ్రహ్మదేవుని వ్రాత బానిస వ్రాతరాయనియు అనగా శబ్దము నోటియందున్నదనిన్ని, నోటియందు నాలుక యుండుటవలన, ఆనాలుక కదలికచేత సంకల్పములు కలుగుచున్నవని, ఆసంకల్పములే బ్రహ్మవ్రాత యని ఇట్టి బ్రహ్మవ్రాత యనెడు సంకల్పములు లేకుండ జేయుటకు గురువురహస్యమును బోధించునని, గురువుబ్రహ్మవ్రాతను తుడిచివేయుననగా, మౌనముదాల్చు మార్గంబు బోధించునని ఇట్టి బోధ నోటిచేత వచ్చునుగనుక గురువారమునకు నోరుయని చెప్పితిని.

శుక్లవారమనగా:- శుక్లమనగా తెలుపు. జ్ఞానము తెల్లనిది. కీర్తియన్నను తెల్లనిదె. ఇటిజ్ఞానమున్ను, కీర్తియున్ను కావలసినది అజ్ఞానులకున్ను, అపకీర్తులకును కాబట్టి అజ్ఞానరూపమైనది జీవాత్మ, ఇట్టి జీవాత్మ కంఠస్థానమందున్న దని పెద్దలు వచియించిరి. కాబట్టి కంఠస్థానమందుండెడు జీవాత్మకు తెలుపుయనెడు జ్ఞానము కలుగుచున్నది, కాబట్టి శుక్లవారమనగా కంఠస్థానమని చెప్పితిని, ఇట్టి కంఠస్థానమందుండెడు జీవాత్మ పరమాత్మ గుణములతో గూడుట

వలన శుక్లవారమని పిలువంబడియె. ఆదివారము మొదలు గురువారమువరకు షడ్చక్రములనిన్ని, శుక్లవారమునకు బ్రహ్మనివాసస్థానమైన సహస్రారమనిన్ని చెప్పంబడును. కాబట్టి శుక్లవారము జ్ఞానరూపమైన కీర్తి, తెలుపు,బ్రహ్మస్థానమని పిలువంబడియె. సప్తాహం శుక్లవారమందును భజన చేయుచుందురు. సప్తాహంబనిన యీఏడుస్థానములనెడు ఇంద్రియములనుజయించుటే గాక ఆదివారము మొదలు యేడువారముల భజనకాదు. యీ షడ్చక్రములలో యేచక్రము గుండా జీవుడు వెళ్ళునో ఆయా జన్మము లెత్తును. ఆ దినము ఆచక్రమునందు జీవుడు ప్రవేశమైచనిన అయా జన్మమునకు హేతువగును.

శనివారమనగా:- శనియుండుస్థానము గనుక శనియనగా చెడ్డది, కష్టబెట్టునది, చివరిది,నీచమైనది. హీనమైనది దారిద్ర్య దేవత. శనీశ్వరుడు మేలుకు,కీడుకు మూలమైనదికాబట్టి మూలాధారమని పెద్దలు వచించుటవలన, శనివారమనగా గుదస్థానము యని పేరుపెట్టితిని.

# స్థాన్కావారి ముఖ్యగమనింపు

స్థాన్కాప్రవర్తలరాక:- ఆలింగనము జేసుకొనుడి. సుఖముండుడి. దుష్ప్రవర్తనలు మానుడి. మతభేదములు వదలుడి. వ్యభిచారము చేయకుడి. సమత్వమును మదిదలపుడి. స్వతఃసిద్ధముక్తస్వరూపులగుడి. ధైర్యమె దైవము. భయమె అజ్ఞానము, భయమె అంధకారము. సంశయంబెపునర్జన్మకు కూడుటేదు

వంటిది. సర్వజీవులను తనుబిడ్డలవలె దలచుడి. జీవులను నొప్పించకుడి. మదమాంస మత్తుపదార్థములు విడుచుడి. నిదానముగా మాట్లాడుట అభ్యాసము చేయుడి, చేయించుడి. ఎక్కువమాటలు మాట్లాడుట శరీరబలమును అన్నిఐశ్వర్యంబులు తగ్గునని నమ్ముడి. సర్వము నశించునని దృఢముగా నమ్ముడి. ఏమతపద్ధతులను ఉల్లంఘింపక చెవిగొనక యుండుడి. భూతదయ మానకుడి. ఎవరితోనైన మాట్లాడు నప్పుడు వారి నేత్రములదిక్కు జూచుచుమాట్లాడుడి. నిలుజూపుజూడుడి. కను రెప్పలుమెక్కువవాల్చుచుండుట మానుడి. మానముగాయున్న ప్పుడు నాలుక లోపల్లుల నానకుండునట్లు చేయుడి, ముక్కు గోళములు నిక్కించి యుంచుడి. చూచువానియందె చూడుడి. నడుచునప్పుడు కూర్చున్నప్పుడు నడ్డి నీలుకొనియుండుట లేక బలమంతయు రొమ్మునందుంచుట నభ్యశించుడి. పండుకొని నప్పుడు ప్రక్కవాటముగా పాదముపై పాదముంచి కాళ్ళు పొడుగుగా చాపుకొని పండుకొనుడి. దానధర్మము వ్రతము యిచ్చవచ్చినచో చేయుడి. గాలిని మెల్లమెల్లన రేచింపనభ్య సించుడి. గాలిని నిర్బంధించకుడి. మిక్కువిరిగ మీదబడినను, గాలిచేకొట్టబడిన నీటిచేముంచబడిన, భూమిచేవత్తబడిన,

నిప్పుచే కాల్చబడిన, కత్తులచే నరకబడిన, మృగములచే మ్రింగబడిన, పాములచే కఱ్వబడిన, ప్రళయధ్వానములచే హృదయము పగలగొట్టబడిన చలించక, నిగ్మలచిత్తస్వరూపుడై నిల్చువాడు స్థాన్‌కా సమత్వబోధకుడనినమ్ముడి.

ఈ జగత్తును ఒకపూరిగాను, నొకపూరునొక యిల్లుగాను, భావించువాడు స్థాన్‌కా సమత్వబోధకుండు. నీటిని కూటిని కూడబెట్టక పంచిపెట్టుడి. దొరికినవేళ దొరికినట్లు తిని సంతృప్తులగుడు. దయగలవానిని దర్శించుడు. ఎరిగినది మొఱగదు. మొరిగినది ఎఱుగదు, దొరకని దానిని తారాడగూడదు. పొయ్యేదానిని పట్టుకోగూడదు, కోరకలభించెనా తనది. కోరి లభించెనా యితరులది. కోరిన లభించనిది దేవునిది. దేవుని తెచ్చువాడు దగ్గరికి వచ్చుచున్నాడు, దేవుడు తేనివాడు పిలిచిన రాకున్నాడు, తెలివిలేనివారికి తెలియజెప్పుడి. నీయేమితినినను తొడగిన జేసిన పనులను చెరుపుకలుగగూడదు. ఇట్లు చెరుపు చేయకుండువాడే స్థాన్‌కా ప్రబోధకుండని తెలియుడు. ఉన్నది పెట్టవలెను. పెట్టినది తినవలెను. తేరనువచ్చిన దానిపై తెగవజేయక, కష్టమువచ్చినదానిపై యిష్టపడక రెంటిని ఒకటిగా జూడుడి. దప్పిగొన్నవారికి తెప్పైన యిచ్చి దప్పితీర్చుడి. దారిని దొరికినసొమ్ము దారినే దానముజేయుడి. చేతాయెనా రక్షించుకో, చేతగాకున్న తప్పించుకో. నీవు నొరితో మాట్లాడునప్పుడు ప్రతిమాట నీలోనే తర్కించుకో

మాట్లాడుచుండవము. లేనియెడల నీమాటనీకు చెడ్డజేయు చుండును, ఎవరిమనస్సు వారికి మోసపుచ్చుచున్నది. జాగ్రత్త: జాగ్రత్త: (తమంతటతాము తృప్తిజెందియుండుడి) సర్వజీవుల జీవన మెరిగి గర్వము నీరముజేయుడి. చెప్పెవాడు చేయడు, చేయువాడు చెప్పడు గనుక ఏదిముఖ్యమో దానిని వదలకుము. పదిపలుకులుకన్న ఒక్కపలుకు మంచిది. పదిభావములకన్న ఒక్కభావము మంచిది. ఒక్కటే మంచిది. యనగావంట్యాల (మూత్రము.) రెండుమంచిదికాదు, యనగా రెండేళ్ళ (మలము.) ఇల్లులేనిచోటు ఇల్లుగట్టినట్లు, విద్యలేనివారికి విద్య నేర్పినట్లు, పైరులేనిచోటు పైరువేసినట్లు, చెడినపొలము బాగు చేసినట్లు, పడినదానిని లేపి నిలిపినట్లు, ఆకలిగొన్నవారికి అన్నమవసరమైనట్లు, గుణము కుదరనివానికి గుణముకుదిరించు కొనుట అవసరమగును. పాపము చేసినవానికి పుణ్యము కలుగ జేయుట అవశ్యమగును. తప్పాయున్నచోటు సవరణ అవ సరమగునట్లు పాపముజేయువారు పుణ్యము వెదకవలెను. తప్పాలేనిచోటు సవరణతో పనిలేనట్లు, ఆకలి లేనివారికి అన్నము అవసరములేనట్లు, గుణము కుదిరినవారికి గుణము కుదిరించుకొను ప్రయత్న మవసరములేదు. పాపము చేయని

వారికి పుణ్యముతో పనిలేదని దృఢముగా నమ్మడి. ఈ స్థాన్కా రహస్యబోధ ధ్యానమైన బ్రహ్మవిద్యకుసాటి ఇహ పరములందు లేదని దృఢముగా నమ్మము నమ్మము నమ్మము. కోరినవన్నియు నీదాపుకె తప్పక వచ్చునని మూటి ముమ్మాటికి నమ్మి సంపాదించవలెనని కష్టబడకుము. స్థాన్కా రహస్యధ్యానమె సర్వసంపాదన యని దృఢముగా నమ్మము.

## స్థాన్కావారి విచారము

పురుషయత్నమా లేక దైవయత్నమా? పురుష యత్నము దైవయత్నము రెంటితోకూడినదా? యీప్రపంచ మందేదినిశ్చయమో తెలుసుకొన వలెను. కొందరు పురుష యత్నమె నిశ్చయంబని, మరికొందరు దైవయత్నమె నిశ్చ యంబని, ఇంకాకొందరు పురుషయత్నము, ఆతర్వాత దైవ యత్నంబని బలుకుచున్నారు, కాబట్టి నాబోధకు లోబడువారు దైవయత్నమె నిశ్చయంబనినమ్మి, తాననునది లేదుగనుక తనకు కష్టసుఖములు లేవని, తనకెంతమాత్రము కర్తృత్వము లేదని, ఏకోరెక తలంపులేక సర్వము పరబ్రహ్మమే చేయుచు చేయించుచుండు నని నమ్మడు. తనయత్నము సరిపోదు. దైవ యత్నము చెడిపోదు. కొందరు పురుషయత్నం దైవయత్నంబ నెడితలంపే లేదందురు. అట్టివాడిని నేనేయని తలంచుమీ.

1. ధైర్యమె దైవము. జ్ఞానము. వెలుగు. స్వర్గము (దేవగుణము.)

2. మమతయే జీవము. నరకము (జీవగుణము)

3. భయమెదేహము. ప్రపంచము (దేహగుణము)

ఈమూడు గుణములను విభాగములు చేసినచో అనేకము లైన ప్రశ్నలకు మూలమగుచున్నవి.



# ప్రపంచము



ప్రతిమానవుడు పంచమజాతివాడనియే పిలువవచ్చును. అది యెట్లనగా ప్ర=ఎక్కువైన, పంచమ=పంచభూతములు అనగా గాలి, గగనము, మన్ను, నీరు, అగ్ని ఈ పంచవస్తువులగు భూతములతో యేర్పడి వున్నదీదేహము. కాబట్టి పంచముడనగా పంచభూతములతో కూడినదేహమని లేక పంచమ జాతివాడని ప్రతిదేహధారిని పిలువవచ్చును. పంచమజాతివాడనగా మాలవాడని చెప్పుచుందురు. సత్యము విచారించినచో బ్రాహ్మణుడుసహా పంచమజాతివాడనియేపిలువబడుచున్నాడు.

# అణిమాది అష్టసిద్ధుల వివరము

1 అణిమ = అణుప్రమాణములైన జంతువులలో పరమాణువుగా నుండుట.

2 మహిమ = బ్రహ్మాది మద్రూపములకంటె మహాధికుడుగా వుండుట.

3 గరిమ = బ్రహ్మాండముల కంటె గొప్పగావుండుట.

4 లఘిమ = మేరువువంటి బరువు తేలికగా వుండుట.

5 ప్రాప్తి = ఏది కావలయుననిన లభింపజేసుకొనుట.

6 ప్రాకామ్యం = ఆకాశాదులలో సంచరించుట.

7 ఈశత్వము = సూర్యచంద్రులకు అధికారిగా వుండుట.

8 వశిత్వము=సకల ప్రాణులను తనఆజ్ఞకు లోబడునట్లు వశము జేసికొనుట.

గీ॥ గట్టిబ్రహ్మబోధనమ్మి పట్టితిపట్టు
చుట్టు పక్కలను సూరజెక్కె
యెట్టకేలకుజూడ మట్టి చిప్పుమంత
పట్టిమాయ నాకు గట్టిదాయెన్॥

బైత్॥ పూర్ణం, ఖుదాకి జాత్కానాం
పీర్ వో, ముర్షద్ బతాయెహై॥
పూర్ణం, కుల్లెషయ్యాన్ మొ। భర్
భరాహై వుస్కొకహాతెహై॥

సమాప్తం.